Licenced to Post without Prepayment (PMG/VJ/PWPP/17/2009-11)

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు    స్థాపితం: 1930    జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

*Longest Living Newspaper in Telugu Journalism*

# జమీన్‌రైతు

సంపుటి: 81 • సంచిక: 15 • 9-4-2010 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-

సంపూర్ణ దంతరక్షణకు చిరునామా
ఇంప్లాంటేషన్ ద్వారా ఒకే రోజు శాశ్వతంగా కృత్రిమ దంతాలు
ఈ విధానంలో ప్రక్క పళ్ళు అరగదీయవలసిన అవసరం లేదు.
సంప్రదించండి
డా॥ డి. నారాయణరెడ్డి M.Ds.
ప్రొస్థొడాంటిస్ట్ & ఇంప్లాంట్ స్పెషలిస్ట్
DNR అడ్వాన్స్‌డ్ డెంటల్ హాస్పిటల్
వెంకటరమణ హోటల్ ప్రక్కవీధి, మానసప్లాజా, పొగతోట, నెల్లూరు. ఫోన్: 0861 - 2301346. సెల్: 90009 33199

లేజర్ చికిత్స
అత్యంత అధునాతన లేజర్ పరికరంతో చిగుళ్ళ వ్యాధులకు ప్రత్యేక చికిత్స.
7గురు స్పెషలిస్టు డాక్టర్లు కలిగిన ఏకైక సూపర్ స్పెషాలిటీ దంతవైద్యశాల.
రాష్ట్రప్రభుత్వ ఉద్యోగులకు, పెన్షనర్లకు వారి కుటుంబసభ్యులకు రీయంబర్స్‌మెంట్ సదుపాయం.
Professor, Endodontics
కేర్ సూపర్ స్పెషాలిటీ దంతవైద్యశాల
పొగతోట, నెల్లూరు. ఫోన్: 2303300

## ● మంత్రుల ఒత్తిడితో తలదించిన వైఎస్ జగన్

# సర్దుబాటా? లొంగుబాటా?

ఎట్టకేలకు, చిట్టచివరకు రోశయ్యను ముఖ్యమంత్రిగా అంగీకరించడానికి సిద్ధపడ్డాడు వైఎస్.జగన్. గత సెప్టెంబర్ నెలలో వైఎస్ రాజశేఖర్‌రెడ్డి మరణించిన నాటి నుంచి వీరిద్దరి మధ్య సత్సంబంధాలు లేవు. తన తండ్రి నుంచి తనకు వారసత్వంగా దక్కవల్సిన ముఖ్యమంత్రి పీఠాన్ని రోశయ్య అన్యాయంగా ఆక్రమించుకొన్నాడన్నది జగన్ అభిప్రాయం. దాని నుంచి ఆయన్ను క్రిందకు దించి, తాను ఎక్కడానికి చేసిన ప్రయత్నాలన్నీ విఫలం కావడంతో, అక్కసు ఆపుకోలేక రోశయ్యకు దూర దూరంగా మెలిగాడు. సాక్షి టివి ఛానల్ మీద పోలీస్‌దాడితో ఇద్దరి మధ్య సంబంధాలు పూర్తిగా తెగిపోయాయి. ఒకరి ముఖం మరొకరు చూసుకోలేనంతగా దూరం పెరిగింది. ఈ నేపథ్యంలో ఓదార్పు యాత్ర తలపెట్టాడు జగన్. పశ్చిమ గోదావరి, ఖమ్మం జిల్లాలకు వెళ్లి, తన తండ్రి మరణం సమయంలో దుఃఖం ఆపుకోలేక గుండె ఆగి మరణించిన వారి కుటుంబాలను పరామర్శించడం ఈ పర్యటన ఉద్దేశం. కానీ ఆ యాత్ర కాస్తా, జగన్‌కు కాంగ్రెస్‌తో సంబంధాలను తెగతెంపులు చేసే పరిస్థితికి దారి తీస్తుందని పరిశీలకులు అంచనా వేశారు. వైఎస్ ప్రాణ మిత్రుడైన కెవిపి రామచంద్రరావుకు కూడా ఇది ఎంత మాత్రం ఇష్టం లేదు. కానీ జగన్ ఆయన మాట వినిపించుకోలేదు. ఎంత చాకిరీ చేసినా కాంగ్రెస్ అధిష్టానం తనకు గుర్తింపు ఇవ్వదని, తన తండ్రి వలె పాతికేళ్లపాటు అధిష్టానం అనుగ్రహం కోసం ఎదురు చూసే ఓపిక తనకు లేదని, ఏదైతే అదవుతుందని, జనంలోకి వెళ్లకుండా ఆగేది లేదని తెగేసి చెప్పాడు జగన్. మరొకప్రక్క తన సాక్షి దినపత్రికలో రోశయ్య ప్రభుత్వం మీద తీవ్రస్థాయి విమర్శల వర్షం కురిపించాడు. దానితో రోశయ్యకు కూడా కోపం వచ్చింది. జగన్‌కు అనుకూలంగా వుండే మంత్రులను కసురుకోవడం ప్రారంభించాడాయన. జగన్‌తో వుంటే మీ పదవులు ఖాళీ అని భయపెట్టాడు. రేపు జరగబోయే మంత్రివర్గ విస్తరణలో కనీసం 10 మంది జగన్ అనుచరులకు ఉద్వాసన ఖాయం అన్న ప్రచారం జోరుగా జరిగిపోయింది.




దీనితో మంత్రులకు వెన్నులో వణుకు పుట్టింది. అందరూ కలిసి జగన్ వద్దకు పరుగెత్తారు. పాహిమాం అని వేడుకొన్నారు. మీరు నిజంగా రోశయ్యతో యుద్ధం చేయాలనే నిర్ణయం తీసుకొంటే, ఆయన మమ్మల్ని పదవుల నుంచి పీకక ముందే

కొరవ 14వ పేజీలో

## కార్టూన్ స్కేప్




జనాల్ని ఓదార్చుతాడనుకున్నా...
సిఎం పదవి రానందుకు బాధపడొద్దని
ప్రజలే ఆయన్ను ఓదార్చుతున్నారు!

## భేటీకి భారీ నజరానా?

ముఖ్యమంత్రి రోశయ్యతో సర్దుబాటుకు సిద్ధపడి, భేటీ జరిపినందుకు బహుమానంగా వైఎస్ జగన్‌కు భారీ నజరానా లభించినట్లు చెప్తున్నారు. ఈ భేటీ జరిగిన పక్కరోజే ప్రభుత్వం తీసుకొన్న రెండు ముఖ్యమైన నిర్ణయాలు అందుకు నిదర్శనాలు. వాటిలో మొదటిది మచిలీపట్నం ఓడరేవు యాజమాన్యాన్ని టెండర్లు లేకుండా నవయుగ కంపెనీకి అప్పచెప్పడం. నవయుగ కంపెనీ ఇప్పటికే కృష్ణపట్నం ఓడరేవును నిర్వహిస్తున్న సంగతి తెలిసిందే. అయితే ఈ రేవు మీద జగన్‌కు మొదటి నుంచి ఆసక్తి వుంది. బళ్లారి ఇనుప ఖనిజాన్ని ఎగుమతి చేయడానికి అత్యంత అనుకూలమైన రేవు కృష్ణపట్నం మాత్రమే కావడం అందుకు కారణం. బళ్లారి ఐరన్ ఓర్ గనులలో జగన్ పాత్ర, ప్రమేయం జగమెరిగిన రహస్యం. కృష్ణపట్నం ఓడరేవు యాజమాన్యాన్ని తనకు అప్ప చెప్పి, మచిలీపట్నం ఓడ రేవును మీరు తీసుకోండి అని నవయుగ కంపెనీకి వైఎస్ బ్రతికి వున్నప్పుడే చెప్పాడు జగన్. దానిలో భాగంగా కృష్ణపట్నం ఓడరేవు కంపెనీలో మెజార్టీ వాటా ఆయన తీసుకొన్నాడు. వెల్ డూ ఇన్వెస్ట్‌మెంట్స్ అండ్ ఈక్విటీస్ ప్రైవేట్ లిమిటెడ్ అనే

కొరవ 14వ పేజీలో

శుభారంభం
కార్ల యజమానులకు అత్యున్నత సేవలందించేందుకు అనుభవజ్ఞులైన మెకానిక్‌లతో అధునాతన పరికరాలతో 24గంటలు మీకు సేవలందించేందుకు 8-4-2010 ప్రారంభం.
శ్రీ లక్ష్మీ ఆటోమొబైల్స్
Multi car care Centre
we care for your car...
ప్లాట్ నెం. 3, యమహా షోరూం వెనుక, ఇండస్ట్రియల్ ఎస్టేట్, ఎ.కె.నగర్, నెల్లూరు. Mobile : 91777 81188, 98855 81177.
ప్రారంభోత్సవానికి విచ్చేసిన మిత్రులకు, శ్రేయోభిలాషులకు ఇవే మా హృదయపూర్వక కృతజ్ఞతలు.
కె. సతీష్‌కుమార్
టి. శశికాంత్

# ఎవరి కోసం?

ఛత్తీస్‌ఘడ్ రాష్ట్రం దంతెవాడ జిల్లా అటవీ ప్రాంతంలో ఒకేసారి 76 మంది సిఆర్‌పిఎఫ్ జవాన్లను పాశవికంగా చంపి, కేంద్ర ప్రభుత్వానికి పెనుసవాలు విసిరారు మావోయిస్టులు. యాభై ఏళ్ల నక్సల్ చరిత్రలో ఒక్క సంఘటనలో ఇంతమంది సైనికులను తెగనరకడం ఇదే ప్రథమం. రెండు మూడేళ్లలో దండకారణ్యంలో నక్సలైట్ అనేవాడు కనపడకుండా నల్లిని నలిపినట్లు నలిపి పారేస్తామని ఉత్తరకుమార ప్రగల్భాలు పలికిన కేంద్ర హోంమంత్రి చిదంబరానికి దిమ్మ తిరిగిపోయే ఎదురు దెబ్బ ఇది. నక్సలైట్ల శక్తిని చాలా తక్కువగా అంచనా వేశానన్న నిజం ఆయనకు ఈ నెత్తుటి మడుగు చూసిన తర్వాత బోధపడి వుంటుంది.

ఛత్తీస్‌ఘడ్, ఒరిస్సా, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాలలో విస్తరించి వున్న అడవులలో కొన్ని లక్షల కోట్ల విలువ చేసే బాక్సైట్, ఐరన్ ఓర్, మాంగనీసు వంటి ఖనిజాలున్నాయి. వీటిని కొల్లగొట్టడానికి టాటా, జిందాల్, ఆర్సెల్ మిట్టల్ వంటి స్వదేశీ కంపెనీలే కాకుండా, పలు విదేశీ సంస్థలు కూడా వురవుర లాడుతున్నాయి. ఆ అడవులలో నివసించే గిరిజనులు ఈ దోపిడీని ప్రతిఘటిస్తున్నారు. కొన్ని వేల తరాలుగా తాము నివసించే ప్రాంతాలను ఖాళీచేసి వెళ్లి పోవాల్సి రావడం, తాము దేవతలుగా పూజించే కొండలు, గుట్టలు, చెట్లను నాశనం చేయడం వారు సహించలేకపోతున్నారు. ఆ అడవిపుత్రులకు నక్సలైట్లు అండగా నిలబడ్డారు. అది చిదంబరానికి ఇష్టం లేదు. నక్సలైట్లను తుడిచి పెడితే, గిరిజనులను వూళ్ల నుంచి తరిమివేసి, గనులను కార్పొరేట్ సంస్థలకు అప్ప చెప్పాలన్నది ఆయన లక్ష్యం. కొండలు, గుట్టలను దేవతలుగా పూజిస్తే గిరిజనులకు తినడానికి తిండి దొరుకుతుందా అన్నది ఆయన ప్రశ్న. ఖనిజ సంపదను వెలికి తీస్తే ఆ వచ్చే డబ్బుతో గిరిజనుల జీవితాలను బాగు చేస్తామన్నది ఆయన చేస్తున్న తప్పుడు ప్రచారం. అయితే ఏ కార్పొరేట్ సంస్థ ఏ గని త్రవ్వి దేశంలోని ఏ ప్రాంతంలో ఏ ఒక్క గిరిజనుడి బ్రతుకునైనా మెరుగు పరచిందా అన్న ప్రశ్నకు ఆయన వద్ద సమాధానం లేదు. ఖనిజాలు కొల్లగొట్టడానికి భారీ యంత్ర సామగ్రి దింపే కార్పొరేట్ సంస్థలు గిరిజనుల బ్రతుకులను ఏ మాత్రం పట్టించుకోవు. విచక్షణారహితంగా అడవులను నాశనం చేయడం, త్రవ్వి పారేయడం వల్ల అటవీ ప్రాంతాలలో నీటి వూటలు అంతరించిపోతాయి. కొన్నివేల సంవత్సరాలుగా గిరిజనులకు జీవనాధారాలైన అటవీ ఉత్పత్తులు అదృశ్యమైపోతాయి. అడవుల నుంచి నాగరిక ప్రదేశాలకు తరలించిన గిరిజనులు రకరకాల జబ్బులతో, సాంస్కృతిక జీవన విధానం తేడాతో దారుణమైన చావులకు గురి కావడం ఎన్నో సందర్భాలలో ప్రత్యక్షంగా చూశాం మనం. తమ జీవన విధానాన్ని, బ్రతుకుతెరువును, పుట్టి పెరిగిన ప్రాంతాలను, పూజించే చెట్టు పుట్టలను, దేవతలుగా దండం పెట్టే కొండలను సర్వనాశనం చేయడానికి గనుల మాఫియా చేస్తున్న కుటిల ప్రయత్నాన్ని ప్రతిఘటించడమే గిరిజనులు చేస్తున్న నేరం.

నక్సలైట్లు నేరస్తులు కాదు. వారి పోరాటం శాంతిభద్రతల సమస్య కాదు. సిద్ధాంత ప్రాతిపదికన నడిచే పోరాటం వారిది. ఏ మావోయిస్టుకూ ఈ పోరాటం వల్ల స్వలాభం వుండదు. సమాజ శ్రేయస్సు కోసం తాము నమ్మిన మార్గంలో యుద్ధం చేయడం వారి విధానం. వారికి ప్రజల అండదండలున్నాయి. వారు తుపాకి పట్టింది ప్రజల కోసం మాత్రమే. పంజాబ్ టెర్రరిస్టుల వలెనో, ముంబాయి మాఫియా గ్యాంగుల వలెనో నక్సలైట్లను చూడడం, ఆ పద్ధతులతో వారిని నాశనం చేయగలమని భావించడం చిదంబరం తెలివి తక్కువతనం మాత్రమే. ఆయన ప్రారంభించిన గ్రీన్ హంట్ ఎవరి కోసమో ప్రపంచానికి తెలుసు. పది పన్నెండు గనుల కంపెనీల ప్రయోజనం కోసం లక్షలాది మంది గిరిజనుల జీవితాలను సర్వనాశనం చేయాలన్న పట్టుదలతో వ్యవహరిస్తున్నది కేంద్ర ప్రభుత్వం. ఇది ఎంత మాత్రం మంచి పద్ధతి కాదు. ఛత్తీస్‌ఘడ్ ఖనిజ సంపదలో గిరిజనులకు సహజ న్యాయం ప్రకారం వాటా లభించే తీరులో గనుల విధానాన్ని తిప్పి వ్రాస్తే తప్ప ఈ యుద్ధం ఆగదు. ఇటువంటి చేదు అనుభవాలు ముందు ముందు ఇంకా ఎన్నో అనుభవంలోకి రాక తప్పదు.

జమీన్‌రైతు

## జనవాణి

### తిరుమల బయట కళ్యాణాలు తప్పు!

అఖిలాండ కోటి బ్రహ్మాండనాయకుడు వెంకటేశ్వరస్వామిని కళ్యాణం పేరుతో ఊరూరా తిప్పడం సమంజసం కాదు. ఇటీవల స్వామి కళ్యాణాలు రాష్ట్ర సరిహద్దులు దాటి ఇతర రాష్ట్రాలకు వ్యాపించాయి. కన్యాకుమారి, ఢిల్లీలలో ఇటీవల స్వామి కళ్యాణాలు జరిగాయి. ధర్మసూత్రం ప్రకారం స్వామి సేతువు దాటకూడదు. ఈసారి స్వామి కళ్యాణం న్యూయార్క్‌లో నిర్వహించాలని తిరుమల తిరుపతి దేవస్థానం తలపోయడం బాధాకరం. ఈ కళ్యాణాల పేరిట లక్షలాది రూపాయల స్వామి డబ్బు హారతి కర్పూరమవుతున్నా పట్టించుకొనేవారు లేరు.

వాస్తు రామచంద్ర, నెల్లూరు

### పెచ్చుమీరుతున్న దొంగతనాలు

నెల్లూరుజిల్లాలో ఇటీవల దొంగతనాలు ఎక్కువయ్యాయి. తాళంవేసి వుంటేచాలు ఆ ఇంటిని దోచుకొంటున్నారు. నెల్లూరు నగరంలో పగటిపూట దొంగతనాలు జరుగుతున్నాయి. ఎస్పీ దామోదర్ గారు జిల్లాలో పోలీసు సంస్కరణలకు శ్రీకారం చుట్టారు. దీనిలోభాగంగానే పోలీసు గస్తీలో ప్రజలను భాగస్వాములు చేస్తే మంచి ఫలితాలుంటాయి. ఈదిశగా ఆయన ఆలోచన చేస్తే బాగుంటుంది.

సిహెచ్.సురేష్‌బాబు, నెల్లూరు

### కోటలో మైకా స్క్రాప్ జల్లెడ!

కోట ఊరి మధ్యలో పొదలకూరు, రాపూరు మైకా మైన్ల నుంచి తెచ్చిన స్క్రాప్‌ను కొందరు జల్లెడ పట్టిస్తున్నారు. దీనివల్ల ఈ పరిసర ప్రాంతాల్లో నివాసముండే వారికి డస్ట్ అలర్జీ, టిబి, గుండె జబ్బులు, ఆస్మా లాంటి జబ్బులు వస్తున్నాయి. ఎక్కడ మైకా గనులున్నాయో అక్కడే ఈ పనులు చేయడం వుత్తమం. అంతేగాని గ్రామం నడిబొడ్డులో చేస్తుంటే అధికారులు సైతం చూస్తూ ఊరుకోవడం దారుణం.

పెల్లేటి గోపాల్‌రెడ్డి, కోట

### అంతిమ విజయం న్యాయానిదే!

ప్రథమంలో సాంఘికంగా వెనుకబడిన ఒకే మతంలోని కొన్ని కులాలకే

కొరవ 14వ పేజీలో

## 70 ఏళ్ల క్రితం ఈవారం

12-4-1940
పేజీలు : 12 వెల: అణా

### ఇడుపులపాడు రైతాంగ విద్యాలయం

ఏప్రెల్ 9తేదీ నుంచి ఇడుపులపాడులో ఆంధ్ర రైతాంగ విద్యాలయం ప్రారంభింపబడును. ప్రారంభోత్సవం ఆంధ్రప్రభ సంపాదకులగు న్యాపతి నారాయణమూర్తి గారిచే జరుపబడును. విద్యాలయ ప్రిన్సిపాల్‌గా అమెరికాలో విద్యసభ్యసించిన కె.బి. కృష్ణ ఎం.ఏ, పిహెచ్‌డి గారుందురు. ఇడుపులపాడుకు చీరాల రైల్వేస్టేషన్‌లో దిగి బస్సులో వెళ్లవలెను.

### లక్ష చోరీ

2తేదీన నెల్లూరు తాలుకాఫీసు ఖజనాలో పోయిన లక్ష రూపాయల చోరీ విషయమై ఇంతవరకును క్రింది మొత్తాలు దొరికినవి.

| | |
|---|---|
| 1. 7తేది మషాల్జీ | రూ 9800/- |
| 2. 8తేది షరాబు | రూ 89199/- |
| 3. 9తేది ఉదయం | రూ 400/- |
| 4. 9తేది సాయంత్రం | రూ 200/- |
| 5. 10తేదీ ఉదయం | రూ 200/- |
| ఇంకను దొరకవలసింది | రూ 201లు మాత్రమే. |

### వెంకటగిరి

జాతీయ వార సందర్భంలో 9వతేదిన జెండా చౌకు వద్ద చీళ్ల గురునాధ గారధ్యక్షతన జరిగింది. గురునాధం గారు జలియన్ వాలా బాగ్ దురంతము, యుద్ధ పరిస్థితులు మన రాజకీయ క్లిష్ట పరిస్థితులు గూర్చి దీర్ఘోపన్యాసం గావించారు. బీరం రామనాధం గారు కూడా వుపన్యసించిరి.

## 50 ఏళ్ల క్రితం ఈవారం

8-4-1960
పేజీలు: 12 వెల: 0-20 న.పై

### మద్రాసులో సోమశిల ప్రసక్తి!

పరిశ్రమల మంత్రి ఏ.సి సుబ్బారెడ్డి గారు ఈవారంలో మద్రాసులో ఒక సభలో మాట్లాడుతూ, సోమశిల ప్రాజెక్టు నిర్మాణంలో మద్రాసు ప్రభుత్వం సగం ఖర్చు భరిస్తే మద్రాసు నగరానికి మంచినీరు కావలసినంత సరఫరా చేయగలమని ఒక సూచన జేశారు. ఇది అమలు జరిగేది కాదు కాబట్టి మన నీరు మద్రాసు కివ్వడమేమిటి అనే వివాదంలోకి దిగవలసిన అవసరం లేదు. నీలం సంజీవరెడ్డి గారు గోదావరిని మద్రాసుకు మరలిస్తామంటే, సుబ్బారెడ్డి గారు పెన్నను వారి పెరటిలోకే తీసుక పోతానంటున్నారు. స్పీకరు కాళేశ్వరరావు గారు మాత్రం ఇదేమీ ఇప్పుడు వీలులేదని ప్రకటించారు. ఏమిటి బాధ్యత గలవారి ఊసుపోక ప్రకటనలు?

### ఎవరెస్టు గూడా మాదే!

ప్రపంచంలో కల్లా ఎత్తయిన శిఖరం ఎవరెస్టు గూడా తమదేనని చైనా ప్రధాని చౌఎన్‌లై తనతో వాదించినట్లు నేపాలు ప్రధాని కోయిరాల వెల్లడించాడు. ఎవరెస్టు నేపాల్‌కు చెందినదిగా ఇప్పటివరకు భావించబడుతున్నది. ఎవరెస్టు అధిరోహణ నేపాల్ ప్రభుత్వ అనుమతి మీదనే యింతవరకు జరుగుతున్నది.

కమ్యూనిస్టు చైనా ఆషాఢభూతి తనానికి కిదొక సరిక్రొత్త ఉదాహరణ.

### జి.సి. కొండయ్య వర్గం కాంగ్రెస్ ప్రవేశం

ప్రజా సోషలిస్టు నాయకులు జి.సి. కొండయ్య వారి అనుచరవర్గం ఈనెల 4తేది కాంగ్రెసులో ప్రవేశించారు. కాంగ్రెసు నాయకులు ఏ.సి సుబ్బారెడ్డి, ఆనం సంజీవరెడ్డి, వేమూరు లక్ష్మయ్యగారలు కొండయ్య గారిని కాంగ్రెస్‌లోకి ఆహ్వానిస్తూ, అభినందించి, ఆశీర్వదించారు.

# నెల్లూరు ముచ్చట్లు
## విహంగవీక్షణం

## సిఎం రాక 14న!

ముఖ్యమంత్రిగా పదవీ బాధ్యతలు స్వీకరించిన కొణిజేటి రోశయ్య తొలి సారిగా నెల్లూరు పర్యటనకు 14వ తేది వస్తున్నారు. కృష్ణపట్నం – రామదాసు కండ్రిగ మధ్య నిర్మించిన నాలుగులైన్ల రహదారిని ప్రారంభిస్తారు. విఆర్ కాలేజిలో ఏర్పాటుచేసే సభలో ముఖ్యమంత్రి చేతులమీదుగా ఐదవ విడత భూ పంపిణీ, ఇందిరమ్మ ఇళ్ల పట్టాలు, పావలా వడ్డీకి రుణాలు అందించే కార్యక్రమాల ఏర్పాటుకు సన్నాహాలు చేస్తున్నారు.

## మంత్రి వస్తేనే రోడ్లు శుభ్రం చేస్తారా?

నెల్లూరు కార్పొరేషన్ పారిశుధ్య సిబ్బంది ఇష్టారీతిన వ్యవహరిస్తున్నారు. ట్రంకురోడ్డు లాంటి మెయిన్ రోడ్డు మినహా మిగతా రోడ్లను ప్రతిదినం శుభ్రం చేయడం లేదు. కలెక్టర్, ఎస్పీ, డిఆర్వో, ఆర్డీఓలు ప్రతినిత్యం నాలుగు సార్లు తిరిగే పొదలకూరురోడ్డులో కూడా చెత్తాచెదారం విపరీతంగా పేరుకుపోయి వుంది. 6వ తేది ఈ ప్రాంతంలో పురపాలక శాఖ మంత్రి ఆనం రామనారాయణరెడ్డి పర్యటనను పురస్కరించుకొని కార్పొరేషన్ సిబ్బంది రోడ్లను శుభ్రపరిచారు. బ్లీచింగ్ చల్లారు. ఈ మధ్య నగరంలోని ఏదైనా ప్రాంతంలో రామనారాయణరెడ్డి పర్యటన ముందు వీధులు, కాలువలు శుభ్రపరచడం ఆ తర్వాత గమ్మునుండడాన్ని కార్పొరేషన్ పారిశుధ్య సిబ్బంది బాగా నేర్చుకొన్నారు.

## కాలినడకన వెంకయ్యను దర్శించిన భానుశ్రీ

అవినీతి నిరోధక శాఖాధికారులు మేయర్ భానుశ్రీ ఇంటిపై దాడిచేసి ఆదాయానికి మించి ఆస్తులున్నాయన్న ఆరోపణలపై ఆమె భర్త సుబ్బరాజును అరెస్ట్ చేసి చర్లపల్లి జైలుకు తరలించిన విషయం పాఠకులకు విదితమే. మూడు వారాల అనంతరం ఆమె భర్తకు బెయిల్ రావడంతో నెల్లూరుకు వచ్చిన మేయర్ వెంటనే కాలినడకన స్వగృహం నుంచి గొలగమూడి వెంకయ్యస్వామి దేవస్థానం వరకు కుటుంబసభ్యులతో కలసి నడిచి వెళ్లి మొక్కుతీర్చుకొన్నట్లు తెలిసింది. ఈ మొక్కుబడి మూడోకంటికి కూడా తెలియకుండా మేయర్ జాగ్రత్త పడింది.

## మూడు నెలల్లో సమ్మర్ స్టోరేజి

నెల్లూరు చెరువులో చేపడుతున్న సమ్మర్ స్టోరేజి ట్యాంకు పనులు మూడు నెలల్లో పూర్తవుతాయని రాష్ట్ర పురపాలక శాఖ మంత్రి ఆనం రామనారాయణరెడ్డి చెప్పారు. 6వ తేది నగరంలోని పొదలకూరురోడ్డులో కొత్తగా వేసిన పైపులైన్ల ద్వారా నీటి సరఫరాను మంత్రి ప్రారంభించి మాట్లాడారు. నగరంలో అన్ని ప్రాంతాల్లో పైపులైన్ల ఆధునీకరణకు 120 కోట్ల రూపాయలతో ఓ ప్రణాళిక సిద్ధం చేసినట్లు చెప్పారు. నగరంలో వచ్చే ఏడాది ఆఖరుకల్లా వెయ్యి కోట్ల రూపాయలతో అభివృద్ధి పనులు చేపట్టాలని నిర్ణయించినట్లు వెల్లడించారు. కార్పొరేషన్‌కు పన్ను బకాయిలున్నవారు ఈ నెల 15వ తేది వరకు ఎటువంటి అపరాధరుసుం లేకుండా చెల్లించవచ్చన్నారు. ఈ కార్యక్రమంలో నెల్లూరు ఎమ్పీ మేకపాటి రాజమోహన్‌రెడ్డి, ఎమ్మెల్యేలు ఆనం వివేకానందరెడ్డి, మేకపాటి చంద్రశేఖర్‌రెడ్డి, జిల్లా కలెక్టర్ రాంగోపాల్, ఎస్పీ దామోదర్, మేయర్ భానుశ్రీ, కార్పొరేషన్ కమిషనర్ ఆంజనేయులు తదితరులు పాల్గొన్నారు.

## జిల్లా వ్యవహారాలపై 27న సిఎం సమీక్ష

జిల్లాలో అభివృద్ధి కార్యక్రమాల తీరుతెన్నుల పరిశీలనకు ముఖ్యమంత్రి ఈ నెల 27వ తేది హైదరాబాద్‌లో సమీక్షా సమావేశం ఏర్పాటు చేశారు. ఈ సమావేశం మార్చి 19వ తేది జరగాల్సింది. చివరి నిమిషంలో రద్దయ్యింది. జిల్లా ఇన్‌ఛార్జ్ మంత్రి వెంకటరమణ, కలెక్టర్ రాంగోపాల్‌తోపాటు జిల్లాకు చెందిన ఎమ్మెల్యేలు, ఎమ్మెల్సీలు ఈ సమావేశంలో పాల్గొంటారు. ఈ సమీక్షా సమావేశం వల్ల జిల్లాకు కొద్దోగొప్పో మేలు జరుగుతుందనవచ్చు.

## ట్రెజరీలో ఆగిన బిల్లులు

ఆర్థిక సంవత్సరం ముగిసిన చివరి రోజు పైనుంచి ఉత్తర్వులు రాలేదంటూ నెల్లూరు ట్రెజరీలో 213 బిల్లుల తాలుకు 44,45,827 రూపాయల చెల్లింపులను ఖజానాధికారులు నిలిపి వేశారు. వీటిలో ఎక్కువ భాగం వివిధ ప్రభుత్వ శాఖల అధికారుల టిఏ, డిఏ బిల్లులతోపాటు మధ్యాహ్న భోజన పథకం తాలుకు చెల్లింపులుండడం గమనార్హం.

## ట్రెజరీ వద్ద తుపాకి మాయం

నెల్లూరు ట్రెజరీ వద్ద కాపలా వుండే కానిస్టేబుల్‌కు సంబంధించిన 303 బారెల్ తుపాకి కనిపించకుండా పోవడం సంచలనం సృష్టించింది. ఇక్కడ కాపలా వుండే కానిస్టేబుళ్ల మధ్య విబేధాల వల్ల ఈ తుపాకి మాయమైనట్లు ఉన్నతాధికారుల విచారణలో తేలింది. ట్రెజరీ వద్ద బందోబస్తు వుండేవాళ్లు ఇంత నిర్లక్ష్యాన్ని ప్రదర్శించడం తగనుగాక తగదు.


### చందాదారులకు మనవి

- చందా పంపించేటప్పుడు తమ చందా నెంబరు, పూర్తి పేరు, చిరునామా తెలియపరచండి.
- 'జమీన్‌రైతు' చందాదార్లు తమ చందాను ఎం.ఓ/డి.డి రూపంలో మాత్రమే పంపగలరు. చెక్కులు స్వీకరించబడవు.
- మీ చందా నెంబరు, చందా ఏ తేదికి అయిపోతుందో, అడ్రసు రేపరు మీదనే ముద్రించి వుంటుంది. సకాలంలో చందా చెల్లించవలసినదిగా కోరు తున్నాము.

జీవిత చందా రూ.1000/-

సంవత్సర చందా

స్వదేశంలో రూ.200/-

విదేశాలకు రూ.1000/-

జమీన్‌రైతు

పొగతోట, నెల్లూరు - 524 001

ఫోన్: 0861 - 2327354

సెల్: 98489 66190


## శాసనమండలి ఛైర్మన్

శాసన మండలి ఛైర్మన్ చక్రపాణి 4వ తేది గూడూరు వచ్చారు. ఇక్కడి ఆదిశంకర ఇంజనీరింగ్ కాలేజి తొమ్మిదవ వార్షికోత్సవ వేడుకల్లో ఆయన ముఖ్య అతిథిగా పాల్గొన్నారు. ఈ సమావేశంలో మాతృభాష ఆవశ్యకతను చక్రపాణి నొక్కిచెప్పారు. ఆదిశంకర ఇంజనీరింగ్ కాలేజి నిర్వాహకుడు వంకి పెంచలయ్య, ప్రత్యామ్నాయ ఇంధనవనరుల నిపుణుడు డాక్టర్ జగదీష్ కూడా ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.



నెల్లూరీయుడు కడపలో స్థిరపడ్డ డాక్టర్ మల్లెమాల వేణుగోపాల్‌రెడ్డి రచించిన విరిసిన మల్లెలు పుస్తకావిష్కరణ సభలో వేణుగోపాల్‌రెడ్డి దంపతులను సత్కరిస్తున్న కేంద్రమంత్రి ఎ.సాయిప్రతాప్. వెనుక ఎస్వీ యూనివర్సిటీ మాజీ వైస్ ఛాన్సలర్ కొలకలూరి ఇనాక్ కూడా వున్నారు.

## మందుల కొరత

నెల్లూరు పెద్దాసుపత్రిలో గత పది రోజులుగా మూత్రపిండ వ్యాధిగ్రస్తులు, మధుమేహ రోగుల విభాగంలో మందుల కొరత ఏర్పడింది. దీంతో సామాన్య, మధ్యతరగతీయులను బయట మందులు కొనుగోలు చేసుకోమని డాక్టర్లు వ్రాసి ఇస్తున్న చీటీలను చూసి బెంబేలెత్తుతున్నారు. మార్చి నెలాఖరు వల్ల ఈ సమస్య తలెత్తినట్లు ఆస్పత్రి వర్గాలు సర్దిచెబుతున్నాయి.

## గొప్పలు చెప్పుకొన్న వివేకా!

ఇటీవల ముగిసిన శాసనసభ సమావేశాల్లో తాను 32 ప్రశ్నలు సంధించానని, యిన్ని ప్రశ్నలు మరో ఎమ్మెల్యే సంధించలేదని రూరల్ ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి గొప్పలు చెప్పుకొన్నారు. సమావేశాలు ముగిసాక నెల్లూరు వచ్చిన ఆయన మీడియాతో మాట్లాడారు. నెల్లూరులో అదనపు ఎమ్మార్వో కార్యాలయంతోపాటు మరో పోలీస్‌స్టేషన్ సాధించానన్నారు. ముఖ్యమంత్రి రోశయ్యకు, వైఎస్ జగన్‌కు ఎటువంటి విబేధాలు లేవని చెప్పుకొచ్చారు. పనిలో పనిగా రోశయ్యను కూడా తెగపొగిడారాయన.

## ట్రాన్స్‌కోకు కొత్త ఎస్ఇ!

నెల్లూరు ట్రాన్స్‌కో ఎస్ఇగా పని చేస్తుండిన అశ్వర్థ నారాయణకు సిఇగా ప్రమోషన్ లభించింది. ఆయన స్థానంలో ఎస్ఇగా నందకుమార్ ఈవారంలో బాధ్యతలు స్వీకరించారు. నందకుమార్ నెల్లూరుకు పాతకాపు. ఎస్ఇ కాక మునుపు పలు హోదాల్లో ఇక్కడ పని చేశారాయన.

## బార్‌లో ఘర్షణ – ఒకరి మృతి!

నెల్లూరు మద్రాసు బస్టాండ్ వద్ద గల సూర్య బార్‌లో 4వ తేది సాయంత్రం జరిగిన చిరు ఘర్షణ ఓ వ్యక్తి ప్రాణం తీసింది. మన్సూర్‌నగర్‌కు చెందిన మక్బుల్ ఈ ప్రాంతంలో తోపుడు బండి పెట్టుకొని వ్యాపారం చేసేవాడు. సాయంత్రం మద్యం సేవించను బార్‌కు వెళ్లి అక్కడ సుబ్బు, చోటే, రంగాల మధ్య జరిగిన లడాయిలో మక్బుల్ జోక్యం చేసుకోవడంతో వారు అతనిపై కత్తులతో దాడి చేశారు. కొనఊపిరితో వున్న మక్బుల్‌ను పెద్దాసుపత్రికి తరలించే లోగా ప్రాణాలు కోల్పోయాడు.

## తిరుమలలో భద్రతకు ఎస్పీ సలహాలు!

తిరుమలలో భద్రతా ఏర్పాట్లు మెరుగుపరిచేందుకు టిటిడి ఏర్పాటు చేసిన ప్రత్యేక సమావేశంలో పాల్గొని సూచనలందించమని ఎస్పీ దామోదర్‌కు ఆహ్వానమందింది. ఎస్పీ గతంలో టిటిడి చీఫ్ సెక్యూరిటీ ఆఫీసర్‌గా పనిచేశారు. హైదరాబాద్‌లో నాలుగేళ్లు విఐపి సెక్యూరిటీ విభాగాన్ని పర్యవేక్షించిన అనుభవ ముండడంతో ఈ ఆహ్వానమందింది.

కొరవ 14వ పేజీలో


బంగారం స్పెషల్ ఆఫర్

BIS 916 హాల్‌మార్క్ బంగారు ఆభరణములపై సవరకు రూ.400/- తగ్గింపు. గ్రాముకు రూ.50/- తగ్గింపు. డైమండ్స్ పై 10% తగ్గింపు.

గోల్డ్ ప్యాలెస్

హోటల్ శివం ఎదురుగా, జిల్లా పరిషత్ ఆఫీసు సెంటర్, ఆచారివీధి, నెల్లూరు. ఫోన్: 2331133, 2327611

అమ్మ ఫర్నిచర్స్

"A House of Life style furnitures"

గృహాలంకరణకు కావలసిన ఆత్యాధునిక ఇంపోర్టెడ్ ఫర్నిచర్, రాఘవ సినీకాంప్లెక్స్ రోడ్, నెల్లూరు. సెల్: 9246435616, 9849495615



13వ వర్ధంతి సంస్మరణ



పసుపులేటి విజయకుమార్

ఎన్నేళ్లు గడిచినా
ఎద ఏడిపోని
నీ జ్ఞాపకాలు మనసును
గిలి పెడుతూనే వున్నాయి!
నిన్ను మరచి పోవడం
నా తరం కాదు మిత్రమా!!

ఆడిటర్
టి.వి. వసంతకుమార్‌రెడ్డి

# బాగా పెరిగిన కొబ్బరి బొండాల ధరలు

కాలంతో సంబంధం లేకుండా ఏకాలంలోనైనా కొబ్బరిబొండాలకు గిరాకీ వుంటుంది. వేసవి కాలంలో గ్రీష్మతాపాన్ని తట్టుకొనేందుకు ఎక్కువమంది కొబ్బరి బొండాలను తాగడం వల్ల వీటి డిమాండ్ మరింతగా పెరుగుతుంది. కూల్‌డ్రింక్స్ తాగొద్దని జనవిజ్ఞాన వేదిక చేసిన, చేస్తున్న ప్రచారం మూలంగా పలువురు



కొబ్బరి బొండాలు కొని తాగేట్లు లేవు.

కొబ్బరినీళ్ల తాగేందుకు ఆసక్తి చూపుతున్నారు. ఇదే అదునుగా నెల్లూరు నగరంలో కొబ్బరి బొండాలను విపరీతంగా రేట్లు పెంచేశారు. హాస్పిటళ్లు ఎక్కువగా వుండే పొగతోట, సండేమార్కెట్, బృందావనం ప్రాంతాల్లో నీళ్ల ఒడే కొబ్బరి బొండాం 12 రూపాయల నుంచి 14 రూపాయల వరకు అమ్ముతున్నారు. ఖచ్చితమైన రేటుకు కొబ్బరి బొండాలు దొరికే ప్రాంతాలుగా పేరుబడ్డ మద్రాస్ బస్టాండ్‌లోని ఎసి కూరగాయల మార్కెట్, బారకాసు సెంటర్లలోనూ ఒక్కొక్కటి పన్నెండు రూపాయలుగా కొబ్బరి బొండాలు అమ్ముతున్నారు. మొత్తం మీద కంపెనీ కూల్‌డ్రింక్ ధరకు కొబ్బరి బొండాం కూడ చేరుకోవడంతో సామాన్యులు దీన్ని కొని తాగాలంటే ఒకటికి రెండుమార్లు ఆలోచించాల్సి వస్తుంది. ఇది ఇలా వుండగా నెల్లూరు మార్కెట్‌కు కొబ్బరి

## నరుకూరులో ఆరు – నెల్లూరులో పన్నెండు

బొండాలు ఇందుకూరుపేట, తోటపల్లి, గూడూరు మండలాల నుంచి ఎక్కువగా వస్తాయి. ఈ ప్రాంతాల్లో కొబ్బరిచెట్ల వద్ద నాలుగు, ఐదు రూపాయలకు మంచి కొబ్బరి బొండాలిస్తున్నారు. నెల్లూరుకు కూతవేటు దూరంలోని నరుకూరు సెంటరులో ఆరు రూపాయలకు కొబ్బరి బొండాం దొరుకుతుండగా అక్కడ నుంచి మూడు కిలోమీటర్లు లేని నెల్లూరులో మాత్రం రెండింతలు పెంచి అమ్మడం వేసవి విచిత్రమని సరిపెట్టుకొందామా?

# గిరాకీ తగ్గని కుండ

ఎండవేడిమి నుంచి రక్షణ పొందేందుకు ప్రజలు పలురకాల ప్రయత్నాలు చేస్తుంటారు. ధనవంతులు ఎయిర్ కండిషన్లు అమర్చుకొంటుండగా సాధారణ మధ్యతరగతి ప్రజలు తమకు అందుబాటులో వుండే వాటితో సేదతీరేందుకు ప్రయత్నిస్తున్నారు. చల్లని నీరు త్రాగడం అనేది ఎండాకాలంలో పలువురికి ఇష్టం. ఇందుకోసం ఫ్రిజ్‌లు వున్నా అందరికీ అనువుగా వుండేవి కుండలు. క్రొత్త కుండలో నీరు ఎంతో రుచిగాను, చల్లగాను వుంటుందన్నది అందరికీ తెలిసిందే. దీనిలోనూ తమ నైపుణ్యాన్ని కన్పరచి కుండలకు కొళాయిలను బిగించి అమ్మకాలు సాగిస్తున్నారు వ్యాపారులు. ప్రత్యేకంగా కన్పిస్తున్న ఈ కొళాయి కుండలకు గిరాకి అధికంగానే వుంది. కుండల సైజును బట్టి 50 రూపాయల నుంచి 200 రూపాయల వరకు వున్నాయి. అలాగే ఎండవేడిని తట్టుకొనేందుకు వట్టివేరు చాపలను వినియోగించడం

## ఫ్రిజ్‌లు, కూలర్లు వచ్చినా వన్నె తగ్గలేదు

సర్వసాధారణం. వీటితోపాటు కూలర్ల వాడకం అధికంగానే వుందని చెప్పాలి. మార్కెట్‌లో అందుబాటులో లభించే పలు రకాల వస్తువులతో ఎండాకాలంలో వేసవి తీవ్రత నుంచి ఉపశమనం పొందే



ఊపందుకొన్న కొళాయి కుండల అమ్మకం.

దుకు ప్రజలు తమకు అందుబాటులో వుండే వాటిని వినియోగిస్తుండడంతో ఈ వస్తువుల అమ్మకాలు పెరిగాయి.

# మంత్రికి అవమానంగా లేదా?



బాగా దెబ్బతిన్న నెల్లూరు – ముంబాయి రోడ్డు.

నాగరికతకు చిహ్నాలుగా రహదారులను పేర్కొంటారు. కానీ నెల్లూరు – ముంబాయి రోడ్డును చూస్తే మనమేమన్నా పాతరాతియుగంలో వున్నామా అనే సందేహం కలుగుతుంది. కృష్ణపట్నం పోర్టు అక్కడికి వచ్చే ఇనుపఖనిజం లారీల వల్ల ఎన్ని కుటుంబాలు బాగుపడ్డాయో తెలియదుకాని వీటి వల్ల నెల్లూరు – ముంబాయి రోడ్డు నరకానికి లోగిలిగా మారడం వల్ల సాలుచింతల నుంచి

## నరకలోక లోగిలిగా నెల్లూరు – ముంబాయి రోడ్డు

జిల్లా సరిహద్దు మండలం మర్రిపాడు వరకు వేలాది మంది ప్రజలు నిత్యం నరకవేదన మించిన బాధను అనుభవిస్తున్నారు. వీరిలో ఎక్కువమంది జనం జిల్లా మంత్రి ఆనం రామనారాయణరెడ్డి ప్రాతినిధ్యం వహించే ఆత్మకూరు నియోజకవర్గవాసులు కావడం గమనార్హం. ఇంతకు ముందు నెల్లూరు – బుచ్చి మధ్య స్వర్గీయ బెజవాడ గోపాలరెడ్డి వేయించిన సిమెంటు రోడ్డు 50 ఏళ్ల ఎటువంటి ఇబ్బందులు లేకుండా మనగలిగింది. ఈ మధ్య నడిచిన ఐరన్‌ఓర్ లారీలతో ఈ రోడ్డు క్రుంగి కృశించి డొంక రోడ్డుకన్నా హీనంగా తయారయ్యింది. బుచ్చిరెడ్డిపాళెం – సంగం మధ్య ఈ రోడ్డు (దీన్ని రోడ్డు కూడా అనకూడదేమో?) నీచనికృష్టంగా తయారయ్యింది. గతంలో సంగం – బుచ్చిల మధ్య 15 నిమిషాలు మాత్రమే ప్రయాణ సమయం పట్టేది. ఇప్పుడు గంటకు పైగా పడుతుంది. సిద్దీపురం గ్రామస్తులు వంతుల వారీగా రోడ్డుపై ఎర్రమట్టి లేయకుండా నీళ్ల చల్లుకొని సర్దుకొంటున్నారు. రేబాల, దామరమడుగు ప్రాంతాల్లోనూ రోడ్డు ఘోరాతి ఘోరంగా వుంది. నెల్లూరు – ముంబాయి రోడ్డు జిల్లాలో 115 కిలోమీటర్లు సాగుతుంది. దెబ్బతినిపోయిన ఈ రోడ్డు మరమ్మత్తులకు ఓ కాంట్రాక్టర్ 9.97 కోట్లకు టెండరువేసి ఆ తర్వాత పనులు చేయలేనని చేతులెత్తేశాడు. మళ్లీ ఈ పనికి టెండర్లు ఎప్పుడో? అప్పటివరకు ఈ రోడ్డు విస్తరించిన 115 కిలోమీటర్ల మేర ప్రజలు ఎన్నాళ్లు కష్టనష్టాలు పడాలో? ఈ రోడ్డును వేసేపని, మరమ్మత్తుల పని మొత్తం ఐరన్‌ఓర్ గనుల నిర్వాహకులు లేదా లారీలు నడిపేవారు చేపట్టేలా ప్రభుత్వం ఒక చట్టం చేస్తే తప్ప నెల్లూరు – ముంబాయి రోడ్డు ఇప్పుడల్లా బాగుపడదు.

# ఆర్టీసి బస్సుల్లో టీవీలు!



ఈ డొక్కు బస్సులో టివి లేకుంటేనేం?

మింగను మెతుకు లేదు కానీ మీసాలకు సంపెంగ నూనె అన్న చందంగా వుంది ఆర్టీసి తీరు. ప్రైవేట్ బస్సుల పోటీని తట్టుకొనేందుకు ఆర్టీసి బస్సులలోనూ ప్రయాణీకులకు మెరుగైన సౌకర్యాలు కల్పిస్తామని అధికారులు చెప్తున్నారు. దీనిలోభాగంగా దూర ప్రయాణపు బస్సులతో పాటు ఎక్స్‌ప్రెస్, గ్రామీణ ప్రాంతాల్లో తిరిగే బస్సులలో టెలివిజన్ అమర్చేందుకు సిద్ధమయ్యారు. ప్రయాణీకులకు వినోదం కల్పించాలన్న ఉద్దేశ్యం మంచిదేయైనా అందుకు తగ్గట్లు బస్సులకు మరమ్మత్తులు చేయించాల్సిన అవసరం ఎంతైనా వుంది. ఓల్వో, మేఘదూత్, లగ్జరీ, డీలక్స్, ఎక్స్‌ప్రెస్ బస్సులలో ఇప్పటికే కొన్నింటికి టివిలు ఏర్పాటు చేసున్నారు. మిగతా బస్సులలోనూ ఈ సౌకర్యాన్ని కల్పించేందుకు అధికారులు ఏర్పాట్లు చేస్తున్నారు. ఈ పరిస్థితులలో గుల్లె ఎక్కడికక్కడ తలుపులు, కిటికీలు ఊడివస్తున్న బస్సుల మాటేమిటి? వాటి మరమ్మత్తుల సంగతి పట్టించుకోకపోవడంతో అధిక సంఖ్యలో తిరిగే ప్రయాణీకులు పలు అవస్థలు పడాల్సివస్తోంది. ప్రయాణీకుల సౌకర్యం కోసం టివిల ఏర్పాటు బాగానే వున్నా ముందుగా బస్సులను పూర్తి కండిషన్‌లో వుంచి ఆ తర్వాత ఇలాంటి అదనపు హంగులు అమర్చినట్లయితే బాగుంటుందని పలువురు ప్రయాణీకులు వ్యాఖ్యానిస్తున్నారు.

# నెల్లూరు రైల్వేస్టేషన్ ఆధునీకరణకు నిధులు



రైల్వేస్టేషన్‌లో మంత్రి మునియప్పన్ పరిశీలన.

ఏందయ్యా... ఇవి చల్లని నీళ్లు అని బోర్డు పెట్టారు కొళాయి తిప్పితే నీళ్లేమో వేడిగా వస్తున్నాయి అంటూ కేంద్ర రైల్వేశాఖ సహాయ మంత్రి మునియప్పన్ రైల్వే అధికారులను ప్రశ్నించారు. శనివారం ఆయన నెల్లూరు రైల్వేస్టేషన్‌ను ఆకస్మిక తనిఖీ చేశారు. స్టేషన్‌లోని పలు విభాగాలను పరిశీలించిన ఆయన ప్రయాణీకుల విశ్రాంతి గదిని, మరుగుదొడ్లను తనిఖీ చేశారు. స్టేషన్ ఆవరణలో పలుచోట్ల ఏర్పాటుచేసి వుండే మంచినీటి కొళాయిలను పరిశీలించారు. అందులో నుంచి వచ్చే నీటిని త్రాగారు. కేంద్రమంత్రి ఈ సందర్భంగా అచ్చ తెలుగులో, అందులోనూ నెల్లూరు యాసలో మాట్లాడడం అందరినీ ఆశ్చర్యపరచింది. నెల్లూరు రైల్వేస్టేషన్ ఆధునీకరణకు నిధులు మంజూరు అయ్యాయని త్వరలో పనులు ప్రారంభం అవుతాయని తెలిపారు. రైలు నుంచి వచ్చే వ్యర్థాలను శుభ్రపరిచేందుకు ఎనిమిది కోట్ల రూపాయలు కేటాయించామని, మొదటి విడతగా నాలుగు కోట్ల రూపాయలతో రెండు లైన్లు శుభ్రపరుస్తున్నట్లు వివరించారు. క్రొత్త రైల్వే డివిజన్లు ఏర్పాటుపై ప్రశ్నించిన విలేకరులతో ఆయన చతురోక్తులాడారు. అసలే తెలంగాణ, ఆంధ్ర వివాదాల మధ్య కొత్త డివిజన్ల ఏర్పాటు సాధ్యం కాదన్నారు.

# రేషన్‌కార్డుల తొలగింపు సభల్లో గందరగోళం!



కార్డులు రద్దుచేశారంటూ నెల్లూరు గాంధీనగర్‌లో రెవిన్యూ అధికారిని గదిలో నిర్భందించిన ప్రజలు.

**జిల్లాలో బోగస్ కార్డుల ఏరివేతకు ప్రభుత్వం నాలుగు విడతలుగా సర్వే నిర్వహించింది. ఈ సర్వేలో 50వేల బోగస్ కార్డులున్నట్లు గుర్తించారు. అయితే వీటి తొలగింపుకు ఏర్పాటుచేసిన గ్రామసభల్లో గందరగోళాలు చోటు చేసుకున్నాయి.**

బోగస్ రేషన్‌కార్డుల ఏరివేయాలన్న లక్ష్యంతో ప్రభుత్వం చేపట్టిన సర్వే కార్యక్రమం, అనర్హుల జాబితా ప్రకటించడం గందరగోళంగా మారింది. గత మూడు నెలల నుంచి జిల్లావ్యాప్తంగా రెవెన్యూ యంత్రాంగం బోగస్ రేషన్ కార్డుల సర్వే కార్యక్రమం చేపట్టింది. జిల్లా జనాభాకు మించి రేషన్ కార్డులు జారీ చేసిన విషయాన్ని ప్రభుత్వం కాస్త ఆలస్యంగా గుర్తించింది. దీంతో అనర్హులను గుర్తించి జాబితా నుంచి తొలగించాలని నిర్ణయించి సర్వే కార్యక్రమానికి శ్రీకారం చుట్టింది. నాలుగు విడతలుగా నిర్వహించిన సర్వేలో దాదాపు 50వేలకు పైగా బోగస్ కార్డులున్నట్లు గుర్తించారు.

## తూతూమంత్రంగా గ్రామసభలు

ఇంతకు ముందు బోగస్ రేషన్‌కార్డులు పొందినవారు, రెండేసి ప్రాంతాల్లో కార్డులు తీసుకొన్నవారు స్వచ్ఛందంగా కార్డులు అందజేయాలని అధికారులు కోరారు. కొంతమంది లబ్దిదారులతోపాటు రేషన్‌షాపు డీలర్లు కూడా మండల కేంద్రాలలో ఏర్పాటు చేసిన ప్రత్యేకబాక్సుల్లో కార్డులను వేయడం జరిగింది. గ్రామీణ ప్రాంతాలలో రెవెన్యూ యంత్రాంగం నిర్వహించిన సర్వే ప్రభుత్వం రూపొందించిన మార్గదర్శకాలకు అనుగుణంగా జరగలేదన్న ఆరోపణలు వున్నాయి. ఒక్కో పంచాయితీ పరిధిలో నాలుగు, అయిదు గ్రామాలుంటే కేవలం పంచాయితీ కార్యాలయంలో వున్న గ్రామంలోనే గ్రామసభ నిర్వహించి తూతూమంత్రంగా కార్యక్రమాన్ని ముగించారు.

## అర్హుల కార్డులు తొలగించారు

బోగస్ రేషన్‌కార్డుల లబ్దిదారులను గుర్తించడంతోపాటు, వృద్దాప్య, వితంతు, వికలాంగుల పింఛన్లు పొందేవారిని కూడా గుర్తించాల్సి వుంటుంది. అయితే అధికారులు, సిబ్బంది వీటిని ఏ మాత్రం పరిగణలోకి తీసుకోకుండా కార్యక్రమాన్ని పూర్తి చేశారు. గ్రామీణ ప్రాంతాలలో నిర్వహించిన సర్వే కార్యక్రమంలో బోగస్ రేషన్‌కార్డులు పొందిన వారి కంటే అర్హత కల్గిన వారి పేర్లను అధికంగా తొలగించారన్న విమర్శలు వినిపిస్తున్నాయి. తుది జాబితా అధికారికంగా ప్రకటించకపోయినా లబ్దిదారులలో అయోమయం నెలకొని వుంది. రేషన్ షాపు డీలర్లు లబ్దిదారులు, రాజకీయనేతల మధ్య వివాదాలు రేకెత్తుతున్నాయి.

ఇదే రీతిలో నెల్లూరు, కావలి, గూడూరు, వెంకటగిరి మునిసిపాల్టీలలో కూడా బోగస్ రేషన్ కార్డుల సర్వే జరిగింది. ఈ సర్వేలో గుర్తించిన అనర్హుల జాబితాను ఈ నెల 1వతేది నుంచి 3వతేది వరకు నెల్లూరు నగరంలో 25 కేంద్రాలలో ప్రకటించారు. ఈ కేంద్రాలతోపాటు సంబంధిత రేషన్ షాపు డీలర్ల వద్ద కూడా మరో జాబితాను ప్రజలకు అందుబాటులో వుంచడం జరిగింది. నగరంలో మూడు రోజుల పాటు జరిగిన ఈ కార్యక్రమంలో పలు కేంద్రాల వద్ద గందరగోళ, ఉద్రిక్త పరిస్థితులు ఏర్పడ్డాయి.

రేషన్ షాపుల వారీగా అనర్హుల జాబితా ప్రకటించడం వల్ల ప్రజలు తమ పేర్లు వున్నాయా? లేదా అని నిర్ధారించుకునేందుకు అధికసంఖ్యలో కేంద్రాల వద్దకు తరలివచ్చారు. అర్హత కలిగిన వారిని కూడా అనర్హులుగా ప్రకటించి వుండడంతో అధికారులపై ప్రజలు ఆగ్రహం వ్యక్తం చేయడం జరిగింది. వెంకటేశ్వరపురం, గాంధీనగర్ కేంద్రాలలో అధికారుల్ని ప్రజలు నిర్భందించారు. సర్వే కార్యక్రమంలో అర్హత కలిగినవారిని అనర్హులని ఎలా నిర్ధారించారంటూ నిలదీయడంతోపాటు ఆగ్రహం వ్యక్తం చేశారు. దాదాపు గంటన్నరపాటు కేంద్రాలలో నిర్భంధించడంతో అధికారులు భయాందోళన చెందాల్సి వచ్చింది.

## ఆందోళన వద్దంటున్న అధికారులు!

అర్హత కలిగిన లబ్దిదారుల పేర్లు అనర్హత కలిగిన వారి జాబితాలో వున్నప్పటికి ప్రజలు ఆందోళన చెందాల్సిన అవసరం లేదని జిల్లా అధికారులు ప్రకటిస్తున్నారు. జాబితాలో పేర్లున్నా వారు తిరిగి వినతిపత్రం సమర్పిస్తే దానిని పరిశీలించి తిరిగి రేషన్‌కార్డును పునరుద్ధరించడం జరుగుతుందని అధికారులు భరోసా ఇస్తున్నప్పటికి ప్రజలు మాత్రం దీనిని అంగీకరించడం లేదు. కేంద్రాల వద్ద రాలేని వారు సంబంధిత రేషన్‌షాపుల డీలర్ల వద్ద వుంచిన జాబితాలో కూడా చూసుకోవచ్చని అధికారులు ప్రకటించినా కొందరు డీలర్లు జాబితాను చూపించేందుకు నిరాకరిస్తున్నారు.

అధికారులు నిర్ణయించిన గడువు మూడు రోజులు గడిచిపోయినా కూడా నగర ప్రజలు కేంద్రాలు, రేషన్‌షాపుల చుట్టూ తిరుగుతున్నారు. ప్రజలు అడిగే ప్రశ్నలకు అధికారులు సరైన సమాధానం చెప్పకపోవడంతో ప్రజాగ్రహానికి గురికావాల్సి వస్తుంది. కొన్ని కేంద్రాలలో ప్రజల నుంచి ఎక్కడ నిరసనలు ఎదుర్కోవాల్సి వస్తుందోనని భయపడిన రెవెన్యూ అధికారులు ముఖం చాటేయాల్సిన దుస్థితి ఏర్పడింది. బోగస్ రేషన్‌కార్డుల ఏరివేతకు నిర్వహించిన సర్వే కార్యక్రమం దగ్గర నుంచి అనర్హుల జాబితా రూపొందించే వరకు అవకతవకలు చోటుచేసుకున్నాయి.

ఒక్క నెల్లూరు నగరంలోనే పరిస్థితి ఇలా వుంటే జిల్లావ్యాప్తంగా అనర్హుల జాబితా ప్రకటిస్తే పరిస్థితి ఏ విధంగా వుంటుందో వూహించుకోవచ్చు. ఇప్పటికైన పౌరసరఫరాలశాఖ, జిల్లాకలెక్టర్ స్పందించి జాబితా తయారీ, సర్వేలో జరిగిన అక్రమాలను సరిద్దాల్సిన అవసరం వుంది. ఈ నేపథ్యంలో సర్వే కార్యక్రమంపై ప్రజలు వెల్లడించిన అభిప్రాయాలు దిగువనిస్తున్నాం.

### ఆందోళన చెందవద్దు!



బోగస్ రేషన్‌కార్డుల అనర్హుల జాబితాలో పేర్లున్న లబ్దిదారులు ఎటువంటి ఆందోళన చెందాల్సిన అవసరం లేదు. ఈ జాబితాలో పేర్లున్న అర్హులు తిరిగి దరఖాస్తు చేసుకొంటే అటువంటి వారికి రేషన్‌కార్డును పునరుద్దరించడం జరుగుతుంది. సర్వే నిర్వహించిన అధికారులను నిర్భందించడాన్ని ప్రజలు మానుకోవాలి.

***సౌరబ్‌గౌర్,*** *జిల్లా జాయింట్ కలెక్టర్*

### సర్వేలో అక్రమాలు



బోగస్ రేషన్‌కార్డులను గుర్తించాల్సిన అధికారులు అర్హత కలిగిన వారి పేర్లను తొలగించారు. ఇళ్లలో ఎవరూలేని సమయంలో సర్వేకు వచ్చిన అధికారులు ఈ విధంగా వ్యవహరించారు. ఇప్పటికైనా జిల్లా అధికారులు స్పందించి అర్హులకు న్యాయం చేస్తే బాగుంటుంది.

**కమలమ్మ**

### అర్హత వున్నా పేరు తొలగించారు!



తెల్లరేషన్‌కార్డు పొందేందుకు నాకు అర్హతలున్నప్పటికి అధికారులు నిర్లక్ష్యంగా వ్యవహరించి పేరును తొలగించారు. గతంలో కార్డు జారీచేసే సమయంలో విచారణ జరిపినవారు ఇప్పుడు అర్హతలేదని ఎలా నిర్ధారించారో అర్ధం కావడం లేదు. దీనిపై ఉన్నతాధికారులు పూర్తిస్థాయి విచారణ చేయాలి.

**రమణమ్మ**

### సర్వే అంతా బోగస్సే!



బోగస్ రేషన్‌కార్డులను ఏరివేయాలన్న పేరుతో చేపట్టిన సర్వే కార్యక్రమం అంతా బోగస్సే. నవంబర్, డిసెంబర్ నెలల్లో ఈ కార్యక్రమం నిర్వహించారు. అనర్హులను తొలగిస్తే ఎవరికి అభ్యంతరం వుండదు. కూలీ నాలీ చేసుకొని జీవించే పేద ప్రజలను సైతం అనర్హుల జాబితాలో చేర్చడం బాధాకరం.

**మాదాల వెంకటేశ్వర్లు,** డిప్యూటీ మేయర్

### విచారణ చేయాలి!



బోగస్ రేషన్‌కార్డుల ఏరివేత సర్వే కార్యక్రమం సక్రమంగా జరగలేదు. రెవెన్యూ అధికారులు సర్వేలో అవకతవకలకు పాల్పడ్డారు. వీరి నిర్లక్ష్యం కారణంగా అనేక మంది పేద ప్రజలు రేషన్ కార్డులు కోల్పోయే పరిస్థితి ఏర్పడింది. జిల్లా కలెక్టర్ స్పందించి మరో సారి పూర్తి స్థాయి విచారణ జరిపించాలి.

**అంకమ్మ**



హైదరాబాద్‌లోని పాతబస్తీ అల్లర్లను నిరసిస్తూ నెల్లూరు నగరంలో మౌనప్రదర్శన చేస్తున్న బిజెపి నేతలు ఆంజనేయరెడ్డి, సురేంద్రరెడ్డి, రమేష్ తదితరులు.


*20 రోజుల సుదీర్ఘ విరామం తర్వాత నెల్లూరుకు వచ్చిన మేయర్ భానుశ్రీ సీనియర్ కార్పొరేటర్లతో సమావేశమైన దృశ్యం.*


నెల్లూరులో ప్రముఖ న్యాయవాది, తన చిన్ననాటి మిత్రుడు వేములపాటి అనంతరామయ్య దంపతులను పరామర్శిస్తున్న మాజీ ముఖ్యమంత్రి నేదురుమల్లి జనార్ధనరెడ్డి.


నెల్లూరు ఎఎస్పీగా నాలుగేళ్లు పనిచేసి పదవీ విరమణ చేసిన కనకారావు దంపతులను సన్మానిస్తున్న జిల్లా కలెక్టర్ రాంగోపాల్, ఎస్పీ దామోదర్.

● వెంకటగిరిలో

## దొంగల ముఠా అరెస్ట్!

వెంకటగిరి ప్రాంతంతోపాటు జిల్లా వ్యాప్తంగా వివిధ ప్రాంతాలలో చోరీలకు పాల్పడిన ముఠాను పోలీసులు పట్టుకొన్నారు. వెంకటగిరి సర్కిల్ పరిధిలోని పలు పోలీస్ స్టేషన్లను జిల్లా ఎస్పీ దామోదర్ ఆకస్మిక తనిఖీలు నిర్వహించారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ జిల్లాలో పలుచోట్ల దొంగతనాలకు పాల్పడిన దొంగల ముఠాను, చిల్లర దొంగలను అరెస్ట్ చేసినట్లు చెప్పారు. వెంకటగిరి పోలీసులకు దొరికిన వీరి వద్ద నుంచి 47 సవర్ల బంగారు నగలు, 20వేల రూపాయల నగదు, 5సెల్‌ఫోన్లు స్వాధీనం చేసుకొన్నట్లు వెల్లడించారు. సంగం మండలం అన్నారెడ్డిపాలెం, గాంధీజనసంఘం గ్రామాలకు చెందిన జయరామయ్య, పెంచలయ్య,

### పెద్ద మొత్తం రికవరీ

బాబు, నక్కా వెంకటేశ్వర్లు, కంపా వెంకటరమణయ్యలు ఈ ముఠా సభ్యులు. వీరు జిల్లాలోని దుత్తలూరు, వింజమూరు, కలిగిరి, కలువాయి, రాపూరు, బాలాయపల్లి, డక్కిలి, వెంకటగిరి మండలాల్లో పెద్ద ఎత్తున చోరీలకు పాల్పడ్డారని ఎస్పీ చెప్పారు. ఉప్పు వ్యాపారం చేసే నెపంతో రాత్రిళ్ల ఆయాగ్రామాల్లో ఉంటూ అదును చూసి దొంగతనానికి పాల్పడం, మహిళల మెడలో నగలు దొంగిలించడంలో నేర్పరులట. ఈ ముఠాను పట్టుకోవడంలో కీలకంగా వ్యవహరించిన కానిస్టేబుల్ వెంగయ్య, శ్రీనివాసులకు ఎస్పీ రివార్డులు అందజేశారు.

ముత్తుకూరులో...

## మంచినీటి ఎద్దడి!

ముత్తుకూరు మండలంలో మంచినీటి ఎద్దడి తీవ్రంగా వుంది. వేసవి కాలం ప్రారంభంలోనే నీటి కోసం కష్టాలు పడాల్సిరావడంతో భవిష్యత్తులో మరిన్ని కష్టాలు తప్పేట్లు లేవని పలువురు వ్యాఖ్యానిస్తున్నారు. మండలంలోని పోలంరాజుగుంట పంచాయితీ పరిధిలో వున్న అలగల హరిజనవాడ ప్రజలు తీవ్రమైన మంచినీటి సమస్యను ఎదుర్కొంటున్నారు. 150 మంది జనాభా కల్గిన ఈ ప్రాంతంలో దీర్ఘకాలంగా మంచినీటి సమస్యతో ప్రజలు ఇబ్బంది పడాల్సి వస్తోంది. గతంలో ఒకటి రెండు సార్లు పైపులైను వేసినా అవి వేసిన కొద్దిరోజులకే

### అల్లాడుతున్న ప్రజలు

నీటి సరఫరాలో ఆటంకం ఏర్పడడంతో దానిని అంతటితో వదిలేశారు. నిడిగుంటపాళెం పంచాయితీ నుంచి నీటి సరఫరా చేయాలని అధికారులు భావించినా పంచాయితి పాలకవర్గం ఒప్పుకోకపోవడంతో ట్రాక్టర్ ద్వారా నీటి సరఫరా చేయాలని అధికారులు ఆదేశించారు. కానీ ఆ ఆదేశాలు కొద్దిరోజులు మాత్రమే అమలయ్యాయి. తర్వాత ట్రాక్టర్ సరఫరా నిలిచిపోవడంతో హరిజనవాడ ప్రజలు గత కొన్నేళ్లుగా మంచినీళ్ల కోసం నానాఅవస్థలు పడాల్సి వస్తోంది.

కొండ్లపూడి

## రైతుల కష్టాలు!

రూరల్ మండలం కొండ్లపూడిలోని రైతులకు పంటను ఇంటికి తెచ్చుకొనే దారి లేక అవస్థలు పడాల్సివస్తోంది. ఆరుగాలం శ్రమించి పండించిన పంట చేతికి వచ్చినా గ్రామాల్లోకి వచ్చేందుకు అనువైన మార్గం లేక పొలాల్లోనే వుంచుకోవాల్సిన పరిస్థితి ఎదురౌతుంది. కొండ్లపూడి – రాజగోపాలపురం ప్రాంతాల మధ్య వున్న కాలువపై బ్రిడ్జి లేకపోవడం వల్ల ధాన్యాన్ని ఇంటికి తెచ్చుకొనే వెసులుబాటు లేదు. ధాన్యం పండినా, కోత కోసినా పొలాల్లో పెట్టుకొని కాపలాకాయాల్సి వస్తోందని రైతులు వాపోతున్నారు. ధాన్యం బస్తాలు, వరిగడ్డి ఊర్లోకి తెచ్చుకోవాలనుకుంటే కాలువపై వుంచిన తాటిమాన్లపై నడవలేక, సాహసం చేయాల్సిన పరిస్థితి ఏర్పడుతోందని కొండ్లపూడివాసులు ఆవేదన వ్యక్తం చేస్తున్నారు. ఏళ్ల తరబడి ఈ సమస్యలను ఎదుర్కొంటున్నా అధికారులు గాని, ప్రజాప్రతినిధులుగాని పట్టించుకోకపోవడంతో కష్టాలు తప్పడం లేదని వాపోతున్నారు. ఇప్పటికైనా జిల్లా ఉన్నతాధికారులు స్పందించి కాలువపై బ్రిడ్జి నిర్మాణం చేపట్టాలని కోరుతున్నారు.

**పండిన పంట తెచ్చుకోను నానాపాట్లు**

నిత్యావసర వస్తువుల ధరలను అదుపు చేయడంలో కాంగ్రెస్ ప్రభుత్వం తీవ్రంగా విఫలమైందని భారతీయజనతాపార్టీ జిల్లా అధ్యక్షుడు కర్నాటి ఆంజనేయరెడ్డి ధ్వజమెత్తారు. తోటపల్లిగూడూరు మండలం నరుకూరులో జరిగిన సంతకాల ఉద్యమంలో ఆయన పాల్గొన్ని ప్రసంగించారు. నిత్యావసర వస్తువుల ధరలు ఆకాశాన్ని అంటుతుండడంతో సామాన్య, మధ్యతరగతి ప్రజల జీవనం ప్రశ్నార్ధంగా మారిందన్నారు. దేశానికి స్వాతంత్ర్యం లభించినప్పటి నుంచి ఇంత

## నిత్యావసరాల ధరలు పెరిగాయి!

☛ బిజెపి సంతకాల సేకరణ

పెద్ద ఎత్తున నిత్యావసర వస్తువుల ధరలు పెరిగిన దాఖలాలు లేవన్నారు. ఈ ఘనత కాంగ్రెస్ ప్రభుత్వానికే దక్కుతుందని ఎద్దేవా చేశారు. ధరలు తగ్గించేందుకు కేంద్రప్రభుత్వం తగినచర్యలు చేపట్టాలని కోరుతూ రాష్ట్రపతికి ఐదు కోట్ల సంతకాలను సేకరించి, 10లక్షల మందితో విజ్ఞాపన పత్రాన్ని అందజేయనున్నట్లు తెలిపారు. జిల్లా ఉపాధ్యక్షులు అన్నం శ్రీనివాసులు ఆధ్వర్యంలో జరిగిన ఈ సంతకాల సేకరణ కార్యక్రమంలో కామిరెడ్డి వెంకురెడ్డి, సురేంద్రరెడ్డి, శ్రీనివాసులు తదితరులు పాల్గొన్నారు.

## ప్రజావిజ్ఞప్తులు పట్టని అధికారులు!

**ముత్తుకూరు ప్రజల లబోదిబో**

ముత్తుకూరు మండలంలో జరుగుతున్న ప్రజా విజ్ఞప్తుల దినం ప్రజలకు ఉపయోగపడక, వారి సమస్యలు పరిష్కారం కాకుండా పోతున్నాయి. తహశీల్దార్ కార్యాలయంలో ప్రతి సోమవారం జరిగే ఈ కార్యక్రమానికి ఎంపిడివోతోపాటు పంచాయితీరాజ్, విద్యా, వైద్య ఆరోగ్యశాఖ, ఐకెపి, ఆర్అండ్‌బి తదితర శాఖల అధికారులు హాజరుకావాల్సి వుంది. ప్రజల నుంచి వచ్చే విజ్ఞప్తులకు ఆయా శాఖల అధికారులు స్పందించి వాటి పరిష్కారానికి కృషి చేయాల్సి వుంటుంది. మండలంలో జరిగే ఈ ప్రజావిజ్ఞాప్తుల దినం నామకేవాస్తేగా మారుతోంది. అధికారులెవరూ రాకపోవడం, వచ్చినా ప్రజల సమస్యల పరిష్కారానికి శ్రద్ధచూపకపోవడంతో కార్యక్రమ ఉద్దేశ్యం నీరుగారిపోతోంది. మండలంలోని పలు గ్రామాల నుంచి సమస్యలపై వచ్చే ప్రజలు అధికారులు లేకపోవడంతో ఉసూరుమంటూ వెనుదిరగాల్సిన పరిస్థితులు ఏర్పడ్డాయి. జిల్లా అధికారులు తగిన పర్యవేక్షణ చేయకపోవడంతో మండలంలోని అధికారులు ఇష్టారాజ్యంగా వ్యవహరిస్తున్నారని ప్రజలు వాపోతున్నారు. జిల్లా అధికారులు దీనిపై దృష్టిసారించి మండలాల్లో ప్రజావిజ్ఞప్తుల కార్యక్రమాన్ని సక్రమంగా నిర్వహించేలా చూడాల్సి వుంది.



గుడ్‌ఫ్రైడే వేడుకల్లో భాగంగా శిలువ మోస్తున్న నెల్లూరు రూరల్ ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి.




నెల్లూరు జెండావీధి ప్రాంతంలో కార్పొరేషన్ సరఫరా చేస్తున్న నీరు బురదమయమని చూపుతున్న మూమెంట్ ఫర్ పీస్ అండ్ జస్టిస్ సంఘ అధ్యక్షుడు అబ్దుల్ సమి, కార్యదర్శి ఖాదర్ నవాజ్ తదితరులు.

# కావలి మునిసిపల్ బడ్జెట్ సమావేశంలో గొడవ

**● తప్పుల తడకగా వుందని నిలదీసిన ప్రతిపక్షం**

కౌన్సిలర్ల వాగ్వివాదం, వాకౌట్, ఛైర్మన్ అలకల నడుమ కావలి మునిసిపల్ బడ్జెట్‌కు ఎట్టకేలకు ఆమోద ముద్ర లభించింది. కావలి పురపాలక సంఘం పొట్టిశ్రీరాములు సమావేశ మందిరంలో 2010–11 సంవత్సరం సంబంధించి బడ్జెట్ సమావేశం జరిగింది. ఈ సందర్భంగా పలువురు కౌన్సిలర్లు మునిసిపాలిటి ప్రవేశపెట్టిన బడ్జెట్‌ను అంకెల గారడీ బడ్జెట్‌గా అభివర్ణించారు. బడ్జెట్ రూపొందించిన తర్వాత అధికారులు పరిశీలన జరుపకపోడంతో తప్పుల తడకలుగా వుందని విమర్శించారు. అధికారుల బాధ్యతా రాహిత్యానికి ఇది పరాకాష్ట అని ఆగ్రహించారు. ఈ సమావేశానికి మునిసిపల్ అధికారులందరూ హాజరు కాకపోవడంతో పలువురు కౌన్సిలర్లు అధికారుల తీరును తప్పుబట్టారు. బడ్జెట్ సమావేశం అంటే అధికారులకు లెక్కలేకుండా పోయిందని, చులకన భావం ఏర్పడిందంటూ ఛైర్మన్ నగళ్ల శ్రీనివాస కిరణ్, మునిసిపల్ కమిషనర్ విజయభాస్కర్‌లను నిలదీశారు. అధికారులందరినీ సమావేశానికి పిలిపించాలని తర్వాతే సమావేశం జరపాలననడంతో గందరగోళం నెలకొంది. ఛైర్మన్ సైతం అధికారుల తీరును నిరసిస్తూ బడ్జెట్ సమావేశాన్ని 10 నిముషాలు వాయిదా వేసి తన ఛాంబర్‌కు వెళ్లిపోయారు. బిజెపి కౌన్సిలర్లు కందుకూరి సత్యనారాయణ, భరత్‌లు వాకౌట్ చేశారు. తిరిగి ప్రారంభమైన అనంతరం సమావేశంలో బడ్జెట్‌కు విమర్శలు, ఆరోపణల మధ్య ఆమోదం లభించింది.

**● నేదురుమల్లి పేరుపై**

## వాదోపవాదాలు!

వెంకటగిరిలో క్రొత్తగా నిర్మించిన మునిసిపల్ భవనానికి మాజీ ముఖ్యమంత్రి నేదురుమల్లి జనార్దన్‌రెడ్డి పేరు పెట్టే విషయమై మునిసిపల్ సమావేశంలో సభ్యుల మధ్య వాగ్వివాదం జరిగి రసాభాసగా మారింది. ఈనెల 31తేదిన జరిగిన సమావేశంలో ఛైర్మన్ అల్లం చంద్రమోహన్ నూతన కార్యాలయానికి ఎన్‌జెఆర్ పేరు పెడుతున్నట్లు అజెండాలో తెలుపగా, దీనిని టిడిపి సభ్యులు పెద్దఎత్తున వ్యతిరేకించారు. కాంగ్రెస్ సభ్యులు నేదురుమల్లి పేరు పెట్టాలని సూచించగా, తెలుగుదేశం సభ్యులు స్వాతంత్ర్య సమరయోధులు కటికనేని కళ్యాణ రావు పేరు పెట్టాలని డిమాండ్ చేశారు. దీనికి ఛైర్మన్ స్పందిస్తూ కటికనేని పేరు ఈ సేవా భవనానికి పెడతామని చెప్పగా అందుకు టిడిపి ఫ్లోర్ లీడర్ చెలికం మధుసూధన్‌రెడ్డి, బీరం రాజేశ్వర రావు తీవ్రంగా వ్యతిరేకించారు. దీంతో కాంగ్రెస్, టిడిపి సభ్యుల మధ్య తీవ్ర వాగ్వివాదం జరిగింది. ఒక దశలో ఆవేశకావేశాలు పెరిగిపోవడంతో సభలో గందరగోళం నెలకొనింది.

# పొగాకు రైతుల వెతలు

**ధరలు తగ్గిపోతున్నాయి**

జిల్లాలో పొగాకు ధరలు రోజురోజుకూ దిగజారిపోతుండడంతో రైతులు ఆందోళన చెందుతున్నారు. ఈ ఏడాది పొగాకు సాగు చేసే రైతులకు నారు దశ నుంచే కష్టాలు ఎదురయ్యాయి. శ్రమకోర్చి సాగు చేసినా ధరలు తగ్గుముఖం పడుతుండడంతో దిక్కుతోచని స్థితి ఏర్పడింది. ప్రారంభంలో వర్షాలు లేక సాగు ఆలస్యమైంది. వేలం ప్రక్రియ ఆలస్యంగానే మొదలైంది. గత నెలలో ప్రారంభమైన పొగాకు వేలంలో కిలో పొగాకు 110 రూపాయల ధర పలకడంతో రైతులు వేలాన్ని నిలిపివేసి ఆందోళన చేపట్టారు. తమ సమస్యలను ప్రభుత్వం దృష్టికి తీసుకొనిపోవడంతో అందుకు సానుకూలంగా స్పందించిన ప్రభుత్వం రైతులకు కిలోకు 120రూపాయల ధర ఇచ్చేలా ఒప్పందం కూదుర్చుకొంది. ఈ నెల 8 నుంచి వేలాన్ని తిరిగి ప్రారంభించారు. ప్రారంభరోజున 120 రూపాయల ధర వున్నా అది క్రమేణా తగ్గిపోతుండడంతో రైతులు తీవ్ర ఆందోళనకు లోనవుతున్నారు. వ్యాపారులు సిండికేట్‌గా ఏర్పడి ధరను తమకు అనుకూలంగా తగ్గించి వేయడంతో రైతులు నష్టపోవాల్సివస్తోంది. నాణ్యమైన పొగాకు ధర 105కు పడిపోగా, లోగ్రేడ్ పొగాకు ధర మరింత దయనీయంగా మారింది. దీనిని కిలో 50 రూపాయలకు కొనుగోలు చేసేందుకు వ్యాపారులు ముందకు వస్తుండడంతో దిక్కుతోచని స్థితిలో వుంది రైతాంగం. వ్యాపారుల మోసాన్ని అరికట్టాల్సిన అధికారులు మౌనంగా వుండడంతో తాము తీవ్రంగా నష్టపోతున్నామని, ఇక ఆత్మహత్యలే శరణ్యమని రైతులు వాపోతున్నారు.

**● డాబా హోటళ్లలో**

## మద్యం విక్రయాలు!

ఆత్మకూరు పట్టణంలో జాతీయ రహదారిపై డాబా హోటళ్లు పుట్టగొడుగుల్లా వెలుస్తున్నాయి. నెల్లూరు – ముంబాయి రోడ్డుపై ఇరువైపులా నిబంధనలకు విరుద్ధంగా ఏర్పాటవుతున్న డాబాల వలన ఇబ్బందులు ఎదురౌతున్నా అధికారులు పట్టించుకోవడం లేదు. ఆహార పదార్థాలను అందించేందుకు ఏర్పాటైన ఈ హోటళ్లలో మద్యం విక్రయాలు జోరందుకోవడంతో డాబాలు కాస్త బార్లుగా మారాయి. రాత్రి పగలు అనే తేడా లేకుండా బహిరంగంగా మద్యం అందుబాటులో వుంటుండడంతో త్రాగుబోతులతో కిటకిటలాడుతున్నాయి.

### పట్టించుకోని పోలీసు

డాబా హోటళ్ల నిర్వాహకుల నుంచి నెలనెల మామూళ్లు అందుతుండడంతో అధికారులు వాటి వంక కన్నెత్తి చూడకపోవడంతో డాబా హోటళ్లలో గొడవలు జరుగుతూ శాంతి భద్రతల సమస్యలు ఎదురౌతున్నాయి. రెండు నెలల క్రిందట ఒక డాబా వద్ద హత్య జరగడం తెలిసిందే. అలాగే నెల్లూరుపాళెం వద్ద నిర్వహిస్తున్న డాబా హోటల్‌ను రెవెన్యూ డిఫామ్ పట్టాభూమిని దౌర్జన్యంగా ఆక్రమించి ఏర్పాటుచేసినా అధికారులు స్పందించకపోవడం విమర్శలకు తావిస్తోంది.

## ఎండిన స్వర్ణముఖి

**చెక్‌డ్యామ్‌లు లేకపోవడమే కారణం**

నిన్నటి వరకు జలకళ ఉట్టిపడుతుండిన స్వర్ణముఖి నది నేడు నీరులేక ఎండిపోయింది. తెలుగు గంగ కాలువ నీరు స్వర్ణముఖికి మళ్లించి దాదాపు రెండు నెలలు అవుతుండడంతో కళకళలాడుతుండిన నది కాస్త మార్చి నెల మధ్యలోనే నీరు లేక ఎడారిని తలపిస్తోంది. చిత్తూరు జిల్లా పాకాల మండలం ముంగిలి పట్టు రిజర్వాయర్ వద్ద స్వర్ణముఖి నది ప్రారంభమై చిత్తూరు, నెల్లూరుల్లో 150 కిలోమీటర్ల పొడవునా ప్రవహిస్తుంది. జిల్లాలోని పెళ్లకూరు, నాయుడుపేట, కోట, వాకాడు మండలాల మీదుగా ఈ నది ప్రవహించి సిద్ధవరం వద్ద బంగాళాఖాతంలో కలుస్తుంది. వర్షాకాలంలో నదిలో 1.60 లక్షల క్యూసెక్కుల నీరు ప్రవహిస్తుంది. స్వర్ణముఖిలో నీరు నిల్వ వుంచేందుకు చెక్ డ్యాంలను నిర్మిస్తామని నేతలు ఇచ్చిన హామీలు కార్యరూపం దాల్చకపోవడంతో ఈ పరిస్థితి ఏర్పడింది. చెక్ డ్యాంలు నిర్మించని కారణంగా 0.90 లక్షల క్యూసెక్యుల నీరు వృధా అవుతున్నట్లు సమాచారం. రైతుల వ్యవసాయ సాగుకు, ప్రజల దాహార్తిని తీర్చే ఈ నదిలో నీరు నిల్వ వుండాలంటే ఎగువ భాగంలో చెక్ డ్యాంల నిర్మాణం చేపట్టాలని, నీరు వృధాకాకుండా చూడాలని స్థానికులుకోరుకొంటున్నారు.

## ఎంపిటిసిలలో మార్పు

**ప్రభుత్వ శిక్షణకు హాజరు**

ప్రభుత్వం వివిధ పథకాలపై నిర్వహిస్తున్న శిక్షణా తరగతులకు ఎంపిటిసి, సర్పంచ్‌లు గైర్హాజరు అవుతుండడం ఇటీవల చూస్తున్నాం. దీనికి భిన్నంగా ఇందుకూరుపేట మండలంలో మాత్రం సర్పంచ్‌లు, ఎంపిటిసిలు బుద్ధిమంతులై పోయారు. సభ్యులందరూ శిక్షణా తరగతులకు హాజరై ఆశ్చర్యపరచారు. ఎంపిడివో చిరంజీవి సభ్యులందరిని హాజరుపరచి వారి చేత పంచాయితీ పాలన, బాధ్యతల గురించి కంఠతా అయ్యేలా శిక్షణా కార్యక్రమం నిర్వహించారు. స్పెషల్ ఆఫీసర్ సుధాభారతి, ఎంపిపి కాసా రాధమ్మ, ఉపాధ్యక్షులు సుధాకర్‌రెడ్డి, తహశీల్దార్ రామకృష్ణ, రిసోర్స్ పర్సన్‌లు మాల్యాద్రి, లలితకుమారి, ఖాన్‌లు హాజరై వివిధ అంశాలపై శిక్షణనిచ్చారు.



## తాతా మనవడి సంవాదం

తాత రోశయ్య, మనవడు జగన్ కలుసుకున్నారు. మనసులో బాధను ఒకరికొకరు చెప్పుకున్నారు. ఈ సందర్భంగా రోశయ్య కాస్తంత ఘాటుగానే స్పందించారట. చూడు జగన్! నేను కావాలని ముఖ్య మంత్రిని కాలేదు. అసలు ముఖ్యమంత్రి పదవిపై నాకెప్పుడూ ఆశ లేదు. ఏ ముఖ్యమంత్రి వచ్చినా వారందరికీ నమ్మకంగా సేవ చేశాను. మీ తండ్రి దగ్గర కూడా అంతే నమ్మకంగా వున్నాను. కాలం కలిసొచ్చి అధిష్టానం నన్ను ముఖ్యమంత్రిని చేసింది. నేనేదో పైరవీ చేసుకొని ఈ కుర్చీ లాగేసుకున్నట్లు నువ్వను కోవద్దు!! అంటూ రోశయ్య వివరణ ఇచ్చుకున్నారట. జగన్ కూడా వెనక్కు తగ లేదట. ప్రజాభిమానం వున్నంత వరకూ మమ్మల్ని ఎవరూ ఏమీ చేయలేరంటూ స్వరం పెంచాడట. పరిస్థితిని అర్థం చేసుకున్న కెవిపి రామచంద్రరావు ఇద్దరి మధ్య నారద పాత్ర వహించాడట. మొత్తం మీద ఇంటికొచ్చిన జగన్‌కు రోశయ్య మంచి శాకాహార భోజనంతో 'విందు' ఇచ్చాడు. జగన్ కూడా తృప్తిగా తిని బయటకు వచ్చాడు. ఆ తర్వాత షరా మామూలే!!



## నారాయణ శాపనార్థాలు

సిపిఐ రాష్ట్రకార్యదర్శి నారాయణకు మళ్లీ కోపం వచ్చింది. ఈసారి ఏకంగా రాష్ట్ర మంత్రులపై విరుచుకపడుతున్నాడు. రాష్ట్ర మంత్రులంతా భూ బకాసురులుగా మారారంటూ దుమ్మెత్తిపోశాడు. రాష్ట్రంలోని భూములన్నీ మంత్రుల కైంకార్యానికే సరిపోవడం లేదు. ఇక పేదలకు ఎక్కడ మిగులుతుందంటూ వాపోయాడు. పనిలో పనిగా పాక్ క్రికెటర్ షోయబ్ మాలిక్, సానియా వివాహాన్ని ప్రసావిస్తూ... ఈ విషయాన్ని 'అతి' గా చిత్రీకరిస్తున్నారని మండిపడ్డాడు. మంత్రులు మాత్రం రెండు పెళ్లిళ్లు చేసుకోవడం లేదా? షోయబ్ ఏం పాపం చేశాడంటూ సమర్థించాడు. పత్రికల వాళ్లు కనబడితే నారాయణ అదుపు తప్పుతాడని సిపిఐ కార్యాలయంలో గుసగుసలాడుకోవడం నిజమే అనిపిస్తోంది. చాలాకాలం తర్వాత నారాయణ ఇలా నోరు విప్పడం వెనుక మతలబు ఏమిటా? అంటూ మంత్రులు కూడా ఎంక్వైరీ చేస్తున్నారట! ఏదైతేనేం! మొత్తానికి నారాయణ మళ్లీ పత్రికలకు ఎక్కాడు.



## సూరిబావా! మజాకానా!

పరిటాల రవి హత్య కేసులో ప్రథమ ముద్దాయి మద్దెలచెరువు సూరికి 'భద్రత' కల్పించడం పోలీసులకు సమస్యగా మారింది. తన ప్రాణాలకు ప్రమాదం వుందని, తగిన రక్షణ కల్పించాలంటూ సూరి హైకోర్టులో పిటీషన్ దాఖలు చేశాడు. దీంతో పోలీసులకు మింగుడు పడటం లేదు. ఇప్పటికే సూరిని కోర్టుకు హాజరుపరిచే సమయంలో పోలీసులు నానా ఇబ్బందులు పడుతున్నారట. పదుల సంఖ్యలో పోలీసులు, రకరకాల వాహనాలు సూరి సేవలో పాల్గొంటున్నాయి. ఈ మధ్య సూరికి డూప్‌ను కూడా ఏర్పాటు చేశారట. అయినా సూరి తృప్తి పడకుండా కోర్టుకు ఎక్కడంతో పోలీసులు తలబాదుకుంటున్నారు. జిల్లాలో వున్న పోలీసులందర్ని సూరి బావ రక్షణ కోసం పెట్టాలేమో? అనుకొంటూ పెదవి విరుస్తున్నారట. సూరి బావా? మజాకానా! అంటూ సూరి వర్గీయులు మీసాలు మెలేస్తున్నారట! మొత్తానికి సూరి బావ స్థాయి వివిఐపి కంటే మించేలా వుంది.

## మంత్రి కొడుకు రివాల్వర్ కథ



రాష్ట్రమంత్రి కన్నా లక్ష్మీనారాయణ పుత్రరత్నం, గుంటూరు మాజీ మేయర్ అయిన కన్నా నాగరాజు ఈ మధ్య రివాల్వర్ లేకుండా బయటకు రావడం లేదట. అలవాటు ప్రకారంగానే రివాల్వర్‌ను బ్యాగులో పెట్టుకొని విశాఖపట్నానికి వెళ్లాడు. తిరుగు ప్రయాణంలో విమాన సెక్యూరిటీ సిబ్బంది రివాల్వర్‌ను పట్టుకున్నారు. లైసెన్సు చూపించాలంటూ నిలదీయగా... జెరాక్స్ కాపీని వాళ్ల ముందు పెట్టాడట. అదేం కుదరదు ఒరిజినల్ లైసెన్స్‌ను చూపించాల్సిందేనంటూ భద్రతా సిబ్బంది పట్టుపట్టారట. తాను మంత్రి కొడుకునంటూ బిల్డప్ యిచ్చినా లాభం లేకుండా పోయింది. ఇక లాభం లేదనుకున్నాడో ఏమో కానీ రివాల్వర్‌ను అక్కడే వదిలేసి విమానం ఎక్కాడట. ఇంతకూ మంత్రి కొడుక్కి రివాల్వర్‌తో పనేంటబ్బా! అంటూ అక్కడున్న ప్రయాణికులంతా చెవులు కొరుకున్నారట!

## స్నేహితుని స్మృతుల్లో నాటకార్చన!

### 11ఏళ్లుగా నిర్విఘ్నంగా కామేశ్వరరావు మెమోరియల్ నాటక కళాపరిషత్



నటుడు భానుచందర్‌ను సత్కరిస్తున్న కామేశ్వరరావు మెమోరియల్ నాటక కళా పరిషత్ నిర్వాహక బృందం.

స్నేహం శాశ్వతం, అజరామరం. అంతటి ఉన్నతమైన స్నేహబంధానికి నిదర్శనంగా నాటక కళాపరిషత్ నిర్వహించడం ఆంధ్రదేశంలో విజేత ఆర్ట్స్‌కే చెల్లింది. బహుముఖ ప్రజ్ఞాశాలి, నాటకాలంటే ప్రాణమిచ్చే వై.కామేశ్వరరావు స్మృతిచిహ్నంగా గత పదకొండేళ్లుగా నాటక కళాపరిషత్‌లు నిర్వహిస్తున్నారు ఆయన మిత్రులు. కామన్న అని ఆప్యాయంగా పిలిచే కామేశ్వరరావు ప్రఖ్యాత గాయకుడు ఎస్పీ బాలసుబ్రమణ్యానికి ప్రాణ మిత్రుడు. మార్గదర్శకుడు. ఎన్నో నాటకాలను రచించి, దర్శకత్వం వహించిన కామన్న మరణం మిత్రులకు తీరని వేదన మిగిల్చింది. వారి జ్ఞాపకార్థం నాటక కళాపరిషత్‌లు నిర్వహించాలని తలచి అందుకు తగినట్లే రాష్ట్రస్థాయి నాటకపోటీలు నిర్వహిస్తున్నారు. పురమందిరంలో 5తేది నుంచి 7 తేది వరకు మూడు రోజులపాటు ఈ నాటక పోటీలు జరిగాయి.

నాటక పోటీల ప్రారంభోత్సవానికి ప్రముఖ సినీ హీరో భానుచందర్ ముఖ్య అతిథిగా హాజరయ్యారు. ప్రజల్ని చైతన్యపరచే శక్తివంతమైన మీడియా నాటకరంగం అన్నారు. కళలు ప్రాక్టీస్ చేస్తే రావని అవి భగవంతుడిచ్చే వరమన్నారు. ఇంతమంది అభిమానులను సంపాదించుకొన్న కామేశ్వరరావు ధన్యుడన్నారు. నాటకాలకు మరింత ఆదరణ కావాలని అప్పుడే నాటకరంగం మరింతగా అభివృద్ధి చెందుతుందని తెలిపారు. రాష్ట్రంలో మరెక్కడా నిర్వహించని విధంగా మిత్రుని స్మృత్యర్థం నాటక కళాపరిషత్‌ను 11ఏళ్లుగా జరుపుతున్నామని ప్రఖ్యాత రచయిత వెన్నెలకంటి చెప్పారు. ఆస్కా మేనేజింగ్ ట్రస్టీ, ప్రముఖ ఆడిటర్ జెకెరెడ్డి మాట్లాడుతూ కామేశ్వరరావు గొప్పదనాన్ని వివరించారు. ప్రముఖ సినీనటులు కొండవలస లక్ష్మరావు, మేకప్ ఆర్టిస్టు నంది అవార్డు గ్రహీత ఎస్.ఏ.షరీఫ్, భక్తి సంగీత విద్వాంసులు గుండాల గురవయ్యలను సన్మానించి నగదు పురస్కారం అందజేశారు.

మూడురోజులపాటు జరిగిన నాటక పోటీల్లో అనంతం, గుప్పెటతీరు, ప్రవాసం, ఎవరోవస్తారని, క్షణం ప్రేమచాలు, ఏదేశమేగినా, గుడిఎనకనాసామి, ఆత్మవత్సర్వభూతని నాటకాలు ప్రదర్శించారు. ఈ కార్యక్రమంలో మురళీకృష్ణ హోటల్స్ నిర్వాహకుడు హజరత్‌బాబు, శేషగిరీశం, అనంత్ తదితరులు పాల్గొన్నారు.



నెల్లూరులోని జైన్‌గోల్డ్‌లో లక్కీ డ్రా తీస్తున్న మురళీకృష్ణ గ్రూప్ హోటల్స్ అధినేత గ్రోసు గోపాలయ్య. ప్రక్కన జైన్‌గోల్డ్ అధినేత మణిలాల్‌జైన్.



## రామదూత వద్దకు యడ్యూరప్ప

దేశంలో స్వాములు, వారి భక్తులకు కొదవ లేదు. నెల్లూరు – ప్రకాశం జిల్లాలోని సరిహద్దు గ్రామం చేవూరులో వెలసిన రామదూత ఆశ్రమానికి కర్నాటక ముఖ్యమంత్రి యడ్యూరప్ప మంచి ఎండల్లో హెలికాప్టర్ వేసుకొని మరీ వచ్చి కావలిలో దిగి కారులో వెళ్లి వచ్చారు. యడ్యూరప్ప రామదూత కాళ్లపై పడిపోతుండగా పాపం ఆయనే నిలువరించారు. ఈలోపునే కేంద్ర రైల్వేమంత్రి మునియప్పన్ స్వామి కాళ్లు గట్టిగా పట్టుకోవడంతో ఏమీచేయలేక రామదూత మౌనం వహించారు. డిజిపిగా బాధ్యతలు స్వీకరించిన వెంటనే గిరీష్‌కుమార్ కూడా ఆశ్రమానికి రహస్యంగా వచ్చి పోయారు. ఈ మధ్య దేశంలోని పలువురు ముఖ్యవ్యక్తులు స్వామి రామదూతను సందర్శిస్తున్నారు. ఆయన క్రేజ్ పెంచుతున్నారు.



## నీతి లేని దొంగలు

పోలీసులు, దొంగలతో పొత్తు వద్దని పెద్దలంటుంటారు. పాపమీ విషయం అల్లూరు మాజీ ఎమ్మెల్యే, కావలి నియోజకవర్గ కాంగ్రెస్ ఇన్‌ఛార్జి కాటంరెడ్డి విష్ణువర్ధన్‌రెడ్డికి 4తేది అనుభవపూర్వకంగా అర్థమయ్యేట్లు చేశారు చోర శిఖామణులు. కప్పరాళ్లతిప్పలోని దొంగలను పోలీసులు పట్టుకెళ్లినప్పుడు వారిని మానవతా దృక్పథంతో విడిపించడంతోపాటు వారి సంక్షేమానికి ఎన్నో కార్యక్రమాలను చేపట్టారాయన. ఆదివారం కావలి వచ్చిన కేంద్ర రైల్వేశాఖ మంత్రి మునియప్పన్‌కు స్వాగతం పలకను వెళ్తూ అలవాటు ప్రకారం ప్యాంటు జేబులో లక్షరూపాయలు పెట్టుక వెళ్లారు. ఆయన పనుల్లో ఆయన వుండగా కావలి ప్రాంతంలో బాగా స్థిరపడిపోయిన తిప్పదొంగలు విష్ణు జేబులో లక్ష కొట్టేశారు. ఆయన తరపున సివిల్ పోలీసులకు ఫిర్యాదు చేయను కాంగ్రెస్ కార్యకర్తలు పోలీస్‌స్టేషన్‌కు వెళ్తే వాళ్లు మా పరిధి లోకి రాదు. రైల్వేస్టేషన్‌లో జరిగిన దానికి రైల్వేపోలీసులే బాధ్యులంటూ చెప్పి పంపేశారు.



## మారని భానుశ్రీ

వయస్సు కాస్త తక్కువైనా రాజకీయాల్లో మాత్రం బాగా రాటుదేలిపోయానని మేయర్ భానుశ్రీ లోకానికి చాటి చెప్పారు.

గత మాసం ఆమె ఇంటిపై అవినీతినిరోధక శాఖాధికారుల దాడిచేసి ఆమె భర్త సుబ్బరాజును అరెస్ట్‌చేసి చర్లపల్లి జైలుకు తరలించిన నేపథ్యంలో మూడు వారాల పాటు ఆమె హైదరాబాద్‌లోనే మకాం పెట్టారు. ఆమె కనీసం మూడు నెలలైనా నెల్లూరు నగరానికి రారని చర్చ జరిగింది. ఎటైనా వెళ్లిపోతారని అందరూ చెప్పుకొన్నారు. తెలుగుదేశం పార్టీ అయితే ఆమె కనపడడం లేదని నాల్గవ పట్టణ పోలీస్‌స్టేష న్‌లో ఫిర్యాదు కూడా చేసింది. ఇన్ని గొడవల నేపథ్యంలో ఆమె పతిదేవుడికి బెయిల్ రావడంతో 1తేది నగరానికి వచ్చిన భానుశ్రీ కార్పొరేషన్ కార్యాలయంలో విలేకరుల సమావేశం పెట్టారు. నగరంలో 22రోజులు లేకున్నా నగరాభివృద్ధికి 23కోట్ల రూపాయల నిధులు సాధించుకొచ్చానని చెప్పుకొన్నారు. జరిగిన సంఘటనలకు దిగులు, విచారం లేకుండా గతంలో చెప్పిన మౌనవ్రతాలు, గ్రటా తీసి గట్టునపెట్టి ఆమె నవ్వుతూ మాట్లాడిన తీరు చూసిన వారు 'ఔరా భానుశ్రీ' అంటూ ఆశ్చర్యపోయారు.

60ఏళ్లు పైబడ్డా ఏనాడు తనకు ఆ వయస్సు వచ్చినట్లు కనపడకుండా చాలా జాగ్రత్తలు తీసుకొనేవాడు నెల్లూరు రూరల్ ఎమ్మెల్యే వివేకానందరెడ్డి. పూటకు నాలుగైదు డ్రస్సులు మార్చడం ఆయనకు అలవాటు. చిత్రవిచిత్రమైన వస్త్రాలు, కంటి అద్దాలు,



## స్టైల్ మార్చిన వివేకా

టోపీలధారణతోపాటు వివాదాస్పద మాటలతో ఆయన నిత్యం వార్తల్లో వుంటారు. గత నెలలో జరిగిన అసెంబ్లీ సమావేశాలకు హైదరాబాద్ వెళ్లి వచ్చిన ఆయన ఒక్కసారిగా ఈ వారంలో నెరిసిన జుట్టుతో విలేకరుల సమావేశానికి హాజరు కావడంతో అందరు ఆశ్చర్యపోయారు. చెవుల ప్రక్కన తెల్లజుట్టు, పైన మీసాలకు నల్లరంగులో కనిపించిన ఆయన గుడ్‌ఫ్రైడే రోజు 'శిలువ' మోసి ఈ మాసమంతా లేకుండాపోయిన మీడియా కవరేజిని ఒక్కరోజులోనే పొందేశారు.


మన పిల్లలకు జీవితకాల మహదావకాశం
జాతీయ స్థాయి స్కూల్ నెల్లూరులో ఏర్పాటు

ఎలాంటి విపత్కర పరిస్థితులనైనా ఎదుర్కోగల సృజనాత్మకమైన వ్యక్తిని తయారు చేయడమే "విద్య" పరమార్థం.
... డా॥ సర్వేపల్లి రాధాకృష్ణ







అక్షర విద్యాలయ
వికసిస్తున్న కుసుమాలకు, వికసించే మనసులకు
స్వర్ణభారత్ ట్రస్టు ప్రేరణతో
i Discovery (న్యూఢిల్లీ) భాగస్వామ్య పాఠశాల (హార్వర్డ్, కేంబ్రిడ్జి లాంటి పేరెన్నికగల విశ్వవిద్యాలయాల పూర్వవిద్యార్థులచే ఏర్పాటుచేయబడిన సంస్థ)

ఒకటి నుండి ఐదు తరగతుల వరకు ప్రవేశం ప్రారంభం
జూన్ నెలలో తరగతులు ప్రారంభం. ఇప్పుడే మీ పిల్లల పేర్లు నమోదు చేసుకోండి.

సరస్వతి నగర్, వెంకటాచలం, నెల్లూరు జిల్లా.
ఫోన్ : 0861-2383504, 2383569, సెల్ : 98489 94569, 95022 46750,
e-mail : infoaksharav@gmail.com

25 ఎకరాల విశాల ప్రాంగణంలో, అత్యున్నత ప్రమాణాలతో, లక్షా 50 వేల చ.అడుగుల విశాల భవనాలు ■ పచ్చని పొలాలు, కాలుష్య రహిత గ్రామీణ వాతావరణం ■ జాతీయ రహదారి ప్రక్కన ■ దక్షిణాదిలోకెల్లా విశాలమైన తరగతి గదులు ■ ఇంగ్లీషు, లెక్కలు, సాంఘీక శాస్త్రం, పర్యావరణశాస్త్రం ప్రత్యేక అభ్యాసానికి తరగతి గదిలోనే ఏర్పాట్లు ■ తరగతికి 25 మంది విద్యార్థులు మాత్రమే. ■ ఉపాధ్యాయ, విద్యార్థి నిష్పత్తి 1:15 ■ విద్యాభ్యాస భాగస్వామి i Discovery, X-Seed curriculum తో. ■ "Learning by Doing" teaching method. ■ భారతీయ సంస్కృతి, సాంప్రదాయాల ప్రతీకగా పాఠశాల. ■ నెల్లూరు, గూడూరు, కనుమూరు, కృష్ణపట్నం నుంచి స్కూల్ బస్ సదుపాయం. ■ ఎప్పటికప్పుడు పిల్లల పరిజ్ఞాన అంచనా, తల్లిదండ్రులకు సమాచారం, పరీక్షలు లేని విద్య ■ ఇంగ్లీషు ధారాళంగా మాట్లాడేందుకు శిక్షణ ■ దేశంలోని వివిధ ప్రాంతాల నుంచి అనుభవజ్ఞులైన అధ్యాపకులు. ■ ప్రతి విద్యార్థికి అభిరుచిని బట్టి కంప్యూటర్, మ్యూజిక్, డ్యాన్స్, క్రాఫ్ట్, మరియు యోగాలో శిక్షణ. ■ పరిశుభ్రమైన మధ్యాహ్నం భోజనం. ■ వివిధ క్రీడలకు విశాలమైన ప్రత్యేక ప్రాంగణాలు.

# వారఫలాలు

తేది 10-04-2010 నుండి 16-04-2010 వరకు మీన, మేషాల్లో రవి ; మేషంలో బుధ, శుక్రులు; కుంభంలో గురువు; కర్కాటకంలో కుజుడు; కన్యలో శని; ధనస్సులో రాహువు; మిధునంలో కేతువు; కుంభ, మీన, మేషాల్లో చంద్రుడు సంచరిస్తారు.




బంధువులకు సాయం చేయడంలో శ్రద్ధ చూపుతారు. ఆకస్మిక పరిణామాలు ఎదురవుతాయి. కుటుంబసభ్యుల అభిప్రాయాలకు ప్రాముఖ్యం ఇవ్వాలి. వ్యాపారులకు బాకీలు వసూలవడం కష్టం. ఏదోరకంగా మానసిక వేదనకు గురవుతారు. వ్యాపార వ్యవహారాల్లో చాకచక్యత ప్రదర్శించినా ఆదాయం తక్కువ. విద్యార్థులు చక్కగా తమ సామర్థ్యాన్ని ప్రదర్శిస్తారు.




చుట్టుపక్కలవారు, సన్నిహితులు పొగిడేరీతిలో పనులు చేస్తారు. కుటుంబసభ్యుల నడుమ ప్రతిష్ఠ పెరుగుతుంది. ధనాదాయంలో లోపం ఉండదు. ప్రియవార్తాశ్రవణం మహదానందాన్నిస్తుంది. జ్యేష్ఠులు, మిత్రులు సాయమందిస్తారు. మోసం లేదా అనాదరణలకు గురవుతారు. నిద్రలేమి. వ్యాపారులకు అనుకూల వాతావరణం ఉత్సాహాన్నిస్తుంది.




దైవప్రార్థన, పూజాదులలో మనసు పోనిస్తారు. అనుకొన్నవి సాధిస్తారు. ఆత్మవిశ్వాసం పెంపుదల ఉంటుంది. వృత్తిరీత్యా విశిష్టమైన ఒప్పందాలు చేసుకొంటారు. మిత్రులతో శుభకార్యాలలో పాల్గొంటారు. ఎదురుచూచిన డబ్బు చేతికందుతుంది. వృత్తిరీత్యా కొత్తగా ఒప్పందాలు చేసుకొంటారు. ఆర్థికలావాదేవీలు సరియైన రీతిలో నిర్వహించి విజయం సాధిస్తారు.




పిల్లల విషయాలపై శ్రద్ధ చూపుతారు. అడ్డుతగిలి ఆగిపోయిన పనులు ఊపందుకొంటాయి. ఆస్తికి సంబంధించిన గొడవలు తొలగి మనశ్శాంతి నెలకొంటుంది. రియల్ ఎస్టేట్ వ్యవహారాలు లాభకరంగా ముగుస్తాయి. ప్రయాణాలు ప్రయోజనవంతమవుతాయి. వ్యాపారులకు లాభపరంపరల సూచన. స్త్రీ, పురుషుల మూలంగా మానసిక శ్రమ. రాజకీయులకు మనశ్శాంతి తక్కువ.




దూరంలో ఉన్న సంతానాన్ని కలుసుకొంటారు. సంతానానికి సంబంధించి మేలు వార్తలు వింటారు. విహారయాత్రల్లో పాల్గొంటారు. నియమ నిష్ఠలతో నమ్మకంతో పూజాదులు నిర్వహిస్తారు. వ్యాపారులు చక్కగా లాభాల నార్జిస్తారు. సుఖశాంతులకు లోపం ఉండదు. తొందరపాటు తగ్గించుకోవాలి. ఇంటి రిపేరు వగైరాలకు గాను ఖర్చు అధికంగా ఉంటుంది.




ఆదాయాన్ని మించి ఖర్చులుంటాయి. కొన్ని శుభకార్యాలు ఇతరులమూలంగా వాయిదా పడవచ్చు. బంధుమిత్రులతో సుఖ సంతోషాలలో పాలు పంచుకొంటారు. ఇతరులను పలకరించే సమయంలో జాగ్రత్త అవసరం. ఓర్పుతో అన్ని పనులు సాధించుకొంటారు. ఇరుగు పొరుగువారి సహాయం అందవచ్చు. వ్యాపారులు ఖాతాదారులతో సత్సంబంధాలు కలిగి ఉంటారు.




మానసిక చింత అనారోగ్యభయం ఉండవచ్చు. వ్యాపారులకు ధనాదాయంలో ఆటుపోట్లు అధికం. విద్యార్థులకు చదువు సరిగా సాగదు. ప్రయాణాలు చక్కగా లాభిస్తాయి. ఆర్థికలావాదేవీలు ఓ మోస్తరుగా ఉంటాయి. వారాంతంలో బృందకార్యక్రమాలలో పాలు పంచుకొంటారు. విదేశగమన ప్రయత్నాలు సఫలమవుతాయి. ఎలాంటి సమస్యలనైనా ఉత్సాహంగా ఎదుర్కొంటారు.




ఇరుగుపొరుగు వారి నడుమ మీ మాటే చెల్లుబాటు అవుతుంది. అయినా తొందరపడి మాట్లాడకుండటం మంచిది. ఇంటిలో అన్నివిధాల సుఖమయ వాతావరణం ఉంటుంది. మోసపోయే అవకాశాలున్నాయి జాగ్రత్త. వృత్తి అభివృద్ధికి తోడ్పడే వ్యక్తుల్ని కలుసుకొంటారు. ఉద్యోగరీత్యా ఎదురు చూచిన ఆర్థిక లాభాలు చేతికి అందివస్తాయి. విద్యార్థుల్లో అలసత్వం అధికమవుతుంది.




గట్టి పోటీలను ఎదుర్కోవలసి వస్తుంది. ఆర్థికవిషయాలు మందంగా సాగుతాయి. మానసికోద్రేకాలకు లోనుగావద్దు. నూతన వస్త్రాభరణాలను కొంటారు. సంతానానికి సంబంధించిన విషయాలకు ప్రాధాన్యత నిస్తారు. ప్రయాణాలు సుఖకరంగా ముగియవచ్చు. ప్రతి పని సులువుగా శ్రమలేకుండా చేసి ముగిస్తారు. రియల్ ఎస్టేట్ వ్యవహారాలు కోరుకొన్న రీతిలో జరుగుతాయి.




శుభపరంపరలు చోటు చేసుకొంటాయి. ఇష్టమైన భోజన ప్రాప్తి. వ్యయం అదుపులో ఉంటుంది. ప్రయత్నాలలో మీదే విజయం. శ్రమకోర్చి పని చేస్తారు. వ్యాపారులకు పాతబాకీలు వసూలు అవుతాయి. కొత్త వస్తుజాతాన్ని కొంటారు. సోదరీసోదరులతో ఉంటూ వచ్చిన స్పర్ధలు తొలగుతాయి. వ్యాపారాభివృద్ధికి అవసరమైన చక్కని పునాదులు వేస్తారు.




ఉత్సాహం వురకలు వేస్తుంది. ఆటంకాలు తొలగుతాయి. వ్యాపారులకు నూతనమార్గ విస్తరణలు శుభ ఆరంభాన్నిస్తాయి. మాటకారితనంతో పనులు సాధించుకొంటారు. ఆరోగ్యవిషయంలో అతిజాగ్రత్త అవసరం. ఇంటి శుభ్రతకు, అలంకరణకు ప్రాముఖ్యమిస్తారు. మీ నిరీక్షణ ఫలించి ఎదురుచూచిన వ్యక్తితో సంభాషణ చేస్తారు. విద్యార్థులు భయాందోళనలకు గురి అవుతారు.




నూతన వస్త్రాభరణాలు కొంటారు. పట్టిందల్లా బంగారమవవచ్చు. వ్యాపారవ్యవహారాల్లో మీదే పైచేయి. వ్యాపారులు కీలక నిర్ణయాలు తీసుకొంటారు. పితృసంబంధీకుల ద్వారా మనశ్శాంతి లోపం. పాదాలకు సంబంధించి ఇబ్బందులుండవచ్చు. మనశ్శాంతి కోసం దేవాలయాదులు దర్శిస్తారు. భగవద్ధ్యానానికై కొంత సమయం వెచ్చించాలి. ఖర్చులు ఆదాయానికి తగినవిధంగా ఉంటాయి.

## పంచాంగం

14 తేది అంబేద్కర్ జయంతి. మకర సంక్రమణం.

**శుభ ముహూర్తాలు లేవు.**

**ఏప్రెల్ తిథులు**

**చైత్ర బహుళ**

| | | | |
|---|---|---|---|
| 10 శని | ఏకాదశి | ఉ.11.47 | గం.ల.వ |
| 11 ఆది | ద్వాదశి | మ.2.00 | గం.ల.వ |
| 12 సోమ | త్రయోదశి | సా.3.47 | గం.ల.వ |
| 13 మంగళ | చతుర్దశి | సా.5.04 | గం.ల.వ |
| 14 బుధ | అమావాస్య | సా.5.52 | గం.ల.వ |

**అధిక వైశాఖ శుద్ధ**

| | | | |
|---|---|---|---|
| 15 గురు | పాడ్యమి | సా.6.09 | గం.ల.వ |
| 16 శుక్ర | విదియ | రా.6.03 | గం.ల.వ |

**పి.ఎం.గోపాలాచారి**
16/1020, పొగతోట, నెల్లూరు - 1.
E-mail:maripmgg@yahoo.com

# చెరువు, ఆలయాలకు ఉత్తర నిర్మాణాలు నిషిద్ధం!

## వాస్తు సందేహాలు సమాధానాలు

**ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి**
4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

*వి.కె.ప్రవీణ — హైదరాబాద్*

* *గృహ నిర్మాణం చేయబోతున్నాము. ప్లాను పంపిస్తున్నాను.*

ఆలయం, చెరువులకు ఉత్తరభాగాన గృహ నిర్మాణం నిషిద్ధం. ఆర్థికం, ఆరోగ్యం, సామాజికం అన్ని కూడా భంగమై ఇబ్బందులు తథ్యమని కృష్ణ వాస్తు చెబుతోంది.

దామోదర్‌రెడ్డి — బుచ్చి

* *శివ సందర్శన తర్వాత ఆస్తులమ్ముకొన్నాను - అయితే మొక్కుబడి తీర్చలేదు.*

అవాస్తు దోషప్రదమైన మీ ఆస్తులు అమ్మడానికి 'మహదేవశక్తి' కారణం. ఈ 'లుబ్ధత్వం' ఎందుకుగానీ మొక్కుబడి తీర్చుకవచ్చాక గోమేధుక ధారణ చేయండి.

సోలంకి జానకీదేవి — హైదరాబాద్

* *గురువు శక్తివంతుడే - తీరా వెళ్లాక యంత్రమూ, రాళ్లూ తీసుకోలేదు.*

'కర్మ' తొలగిపోక 'శని' శత్రువేధ ఆవహించినపుడు ఎవరికైనా పెడబుద్ధులు పుడతాయి.

*టి.పెంచలయ్య — స్టోన్‌హౌస్‌పేట*

* *వాస్తుమీద నమ్మకం లేదు. అయినా ఏదో లోపం వున్నట్లు అనుమానం, నిద్రపట్టడం లేదు.*

నమ్మకం లేనప్పుడు నిద్రపట్టనంతగా ఆలోచన లెందుకు? సమస్యను వదలివేయండి. లేదా 'వాస్తు శాస్త్రా' పదపంకజాల్ని ఆశ్రయించండి.

*పి.అప్పారావు — హైదరాబాద్*

* *బిల్డర్ ప్లాను, సర్వేయర్ ఆజమాయిషీతో గృహ నిర్మాణం జరిగింది.*

ప్లాను చూశాను. నైరుతి సెప్టిక్ ట్యాంకు, ఈశాన్యం బాత్రూములు తీసేయాలి. ఇతరత్రా సవరింపులకు రెండు లక్షలు ఖర్చవుతుంది.

*షంషుద్దీన్ పఠాన్ — రాపూరు*

* *తాలూకాలో మండలాలు చకచకా అభివృద్ధి చెందుతున్నాయి. మా రాపూరు ఎక్కడవేసిన గొంగడి అక్కడేవుంది.*

రాపూరుకుదక్షిణ,పశ్చిమ దిశాదోషాలున్నాయి. ప్రణాళికల తప్పిదాల వల్ల ఫలితాలను ప్రజలనుభవిస్తున్నారు. ఉత్తరదిశా 'స్మశానం' మరో మృత్యువేధ. గృహాల్లో యంత్రప్రతిష్ఠలు తప్పనిసరి.

*వి.తిరుపతయ్య — ఆత్మకూరు*

* *ఇరవైఏళ్లుగా వ్యాపారంలో కుటుంబ పోషణ మాత్రమే చేశాను.*

ఆత్మకూరుకు వాయువ్య దిశ 'పిశాచపీడ' అధికం. అంగళ్లు, గృహాలు వాస్తుయుతంగా వుంటేనే అక్కడ జీవనం. రెండింటికీ యంత్రప్రతిష్ఠ చేశాకగానీ చేరకూడదు.

*పి.యశోద — నెల్లూరు*

* *అబ్బాయి బాగా చదివేవాడు. ఇప్పుడెందుకిట్లా తయారయ్యాడు.*

తూర్పుగోడపై రేకుల షెడ్డు తీసివేయండి. నైరుతి ద్వారం ఆగ్నేయంలో పెట్టండి. 'సరస్వతీ యంత్రం' రీడింగ్ రూంలో, బాబుకు 'నీలం' శ్రేష్ఠ ధరింపజేయండి.

*డి.పరిమళ — నెల్లూరు*

* *ఇంటిపై పావురాలు పెంచకూడదా?*

అని ఎవరన్నారు. నైరుతీ, వాయువ్యాలలో పావురాలను పెంచవచ్చు. ఎట్లాంటి దోషాలు కలుగవు.

*పి.అగస్త్యరెడ్డి — నాయుడుపేట*

* *మామిడి చెట్టు ఈశాన్యంలో వుంది. నిండా పూత వుంది?*

పూత, పిందె వృక్షాన్ని నరికితే 'గర్భవతీ హత్యా' దోషం. చెట్టు జీవన ప్రమాణం అయి, ఎండిపోయాక తీసేయాలి. అయితే దోషనివారణకు యంత్రప్రతిష్ఠ కోసం సంప్రదించండి.

*సుబ్బారావు దేవళ్ల — నాయుడుపేట*

* *నైరుతిగదిలో మా దంపతులు, వాయువ్యం గదిలో పిల్లలు, ఆరుబయట తల్లిదండ్రులు పడుకొంటున్నాము.*

ఇంటి యజమానులైన మీ తల్లిదండ్రులు నైరుతిలో సాంప్రదాయం. ఈ వయసులో వారిని తిరస్కరించడం శ్రేయస్కరం కాదు. మనల్ని భగవంతుడు ఒక కంట కనిపెడుతూనే వుంటాడు.

# ప్రగతిపథాన మనుబోలు పంచాయితీ!

ప్రభుత్వం నుంచి విడుదలవుతున్న వివిధ గ్రాంట్లు, పంచాయితీ సాధారణ నిధులతో మనుబోలు గ్రామపంచాయితీ అభివృద్ధి దిశగా పయనిస్తుంది. మేజర్ గ్రామ పంచాయితీగా పేరొందిన మనుబోలుకు జాతీయ రహదారి ప్రక్కన వుండడం వ్యాపారకూడలిగా మారింది. ప్రజలకు కనీస అవసరాలైన త్రాగునీరు సరఫరా, పారిశుద్ధ్యం, అంతర్గత రోడ్లు, వీధిలైట్లు ఏర్పాటులో ఎక్కడా సమస్య లేకుండా పంచాయితీ పాలకవర్గం కృషి చేస్తుంది.

మనుబోలు గ్రామపంచాయితీ సర్పంచ్‌గా తెలుగుదేశం పార్టీకి చెందిన కృష్ణవేణమ్మ 2006 సంవత్సరం జరిగిన ఎన్నికలలో గెలుపొందారు. సర్పంచ్‌గా ఎన్నికైన నాటి నుంచి పంచాయితీలోని సమస్యల పరిష్కారం కోసం అహర్నిశలు శ్రమిస్తున్నారు. పంచాయితీలో 10వేల మంది జనాభా, 7వేల మంది ఓటర్లు వున్నారు. దీని పరిధిలో మాచవరం, బి.సి కాలనీ, ఎస్సీ, ఎస్టీ కాలనీలు, కోదండరామాపురం తదితర కాలనీలు వున్నాయి. గ్రామ పంచాయితీకి 12వ ఆర్థిక సంఘం, ఎస్.ఎఫ్.సి నిధులు కలిపి లక్షా 50వేల రూపాయలు మంజూరవుతాయి.

ఇవే కాకుండా వివిధ పన్నుల రూపంలో మరో 12 లక్షల రూపాయలు ఆదాయంగా సమకూరుతుంటుంది. జాతీయ రహదారి నుంచి దాదాపు ఒకటిన్నర కిలోమీటర్ దూరం వరకు కోటి 80 లక్షల వ్యయంతో సిమెంటు రోడ్డు నిర్మాణం చేపట్టారు. మిగిలిన సగభాగం రోడ్డు నిర్మాణం చేపట్టేందుకు రోడ్లు, భవనాల శాఖ అధికారులతో చర్చలు జరుపుతున్నామని సర్పంచ్ చెప్పారు. పంచాయితీలోని ఎస్సీ, ఎస్టీ, బిసి కాలనీలలో అంతర్గత రోడ్లను కూడా సిమెంట్ రోడ్లుగా నిర్మించి వున్నారు. జాతీయ గ్రామీణ ఉపాధి హామీ పథకం ద్వారా దాదాపు ఆరు లక్షల రూపాయలు కేటాయించి వున్నారు. కేటాయించిన నిధులతో గ్రావెల్, మెటల్ రోడ్లు నిర్మాణం, చేపట్టనున్నారు. ఈ గ్రామపంచాయితీ సర్పంచ్ తెలుగుదేశం పార్టీకి చెందిన వారైనప్పటికి అభివృద్ధి పనులు చేపట్టే విషయంలో కాంగ్రెస్ పార్టీకి చెందిన వార్డు సభ్యులు పూర్తి సహకారం అందిస్తున్నారు. రోడ్డు విస్తరణలో భాగంగా అక్రమణలు తొలగించిన నేపథ్యంలో కొంతమేర డ్రైనేజి కాల్వలు దెబ్బతిన్నాయి. వీటిని కూడా తిరిగి నిర్మించాలని స్థానికులు కోరారు. రెండు ఓవర్ హెడ్ ట్యాంక్‌ల నుంచి త్రాగునీటి సరఫరా చేస్తున్నారు.

మహిళా సర్పంచ్ అయినప్పటికి పంచాయితీ అభివృద్ధి విషయంలో ఏ మాత్రం రాజీ పడకుండా పనులు చేపడుతున్నారు.

### అభివృద్ధికి కృషి చేస్తున్నాను!



గ్రామ పంచాయితీలోని ప్రజలకు ఎటువంటి ఇబ్బంది లేకుండా అన్ని చర్యలు తీసుకోవడం జరుగుతుంది. ప్రస్తుతం త్రాగునీటి సరఫరాకు ఆటంకం కలగకుండా అందిస్తున్నాం. పారిశుద్ధ్యం మెరుగుపరిచేందుకు సిబ్బందిని ఎప్పటికప్పుడు అప్రమత్తం చేస్తున్నాం. కార్యాలయంలో ప్రజలకు అందుబాటులో వుంటున్నాను.

**– యాచవరం కృష్ణవేణమ్మ,** *గ్రామ సర్పంచ్, మనుబోలు*




*మనుబోలు పంచాయితీ కార్యాలయం.*



*గ్రామంలోని ప్రధాన రహదారి.*

అవినీతి కథ

● త్రాగునీటి మోటార్ల

# రిపేర్లలోనూ చేతివాటం!



*నెల్లూరు ప్రజల దాహార్తిని తీర్చే వాటర్ వర్క్స్ విభాగం.*

నెల్లూరు మునిసిపల్ కార్పొరేషన్ కార్యాలయం అవినీతి, అక్రమాలకు పెట్టింది పేరు. ఈ కార్యాలయంపై అవినీతి, ఆరోపణలు వెల్లువెత్తినా ప్రభుత్వం వైపు నుంచి గాని, పాలకవర్గం నుంచి గాని ఎటువంటి విచారణలు వుండడం లేదు. దీంతో ఇక్కడ విధులు నిర్వహించే అధికారుల దగ్గర నుండి క్రిందిస్థాయి సిబ్బంది వరకు ఎవరిస్థాయిలో వారు దొరికినది దొరికినట్లు దోచుకతింటున్నారు. శానిటేషన్ విభాగం, జనన, మరణ ధృవీకరణ పత్రాలు జారీ చేసే విభాగం, ఇంజినీరింగ్, సిటి ప్లానింగ్ ఇలా చెప్పుకొంటూపోతే అన్ని విభాగాలలో అవినీతి అక్రమాలు జరుగుతున్నాయి.

తాజాగా త్రాగునీటి సరఫరా చేసే విభాగంలో విద్యుత్ మోటార్ల రిపేర్ల పేరిట లక్షలాది రూపాయలు దుర్వినియోగం చేస్తున్నారు. వేసవి కాలం వచ్చిందంటే ఈ విభాగంలో పని చేసే ఇంజినీర్లు, ఫిట్టర్లు, సూపర్‌వైజర్లకు రెండు చేతులా సంపాదన వుంటుందంటే ఆశ్చర్యపోక తప్పలేదు. నగరం ఇటీవల బాగా విస్తరించడంతో త్రాగునీటి అవసరం ఏర్పడింది. ప్రజలకు అవసరమైన త్రాగునీరు మునిసిపల్ కార్పొరేషన్ అధికారులు సక్రమంగా సరఫరా చేయలేకపోతున్నారు. దీనికి అనేక కారణాలు చెబుతుంటారు. మోటారు రిపేరు, పైపులైన్ల మరమ్మతులు, విద్యుత్‌కోత తదితర కారణాలు వుంటాయి. వేసవికాలంలో ఈ రిపేర్లు మరింత ఎక్కువగా చూపిస్తుంటారు.

విద్యుత్ మోటార్ల మరమ్మతులు, పైపులను మార్చేందుకు కార్పొరేషన్ అధికారులు అధిక శాతం నిధులు ఖర్చు చేస్తుంటారు. నగర వాసులకు త్రాగునీరు అందించాలన్న సంకల్పంతో యుద్ధ ప్రాతిపదికన నిధులు ఖర్చు చేస్తున్నా ఇంజినీరింగ్ విభాగంలో కొందరు అధికారులు, సిబ్బంది అవినీతి, అక్రమాలకు పాల్పడుతున్నారు. మరమ్మతులకు గురైన విద్యుత్ మోటార్లతో పాటు పనిచేస్తున్న వాటిని సైతం రిపేర్ల జాబితాలో చేరుస్తుంటారు. బయట ఎలక్ట్రీషియన్ల ద్వారా రిపేర్లు చేయించినట్లు రికార్డులలో నమోదు చేసి ప్రజాధనాన్ని స్వాహా చేసేస్తున్నారు. కమిషనర్ కూడా పరిశీలించకుండానే బిల్లులు మంజూరు చేస్తున్నారు.

**నెల్లూరు మునిసిపల్ కార్పొరేషన్‌లోని త్రాగునీటి విభాగంలో మోటార్ల రిపేర్ల పేరిట ప్రతి ఏడాది లక్షల రూపాయలు అధికారులు, సిబ్బంది స్వాహా చేస్తున్నా అడిగేనాథుడు లేకుండా పోయారు.**

విద్యుత్ మోటార్ల రిపేరు పేరిట కార్పొరేషన్ నిధులు విచ్చలవిడిగా దుర్వినియోగం జరుగుతున్న విషయం ఇటు పాలకవర్గం కార్పొరేషన్ ఉన్నతాధికారులకు తెలిసినా కూడా ఎవరు పట్టించుకోవడం లేదు.

ఇదిలా వుండగా ట్రాక్టర్లు, ట్యాంకర్ల ద్వారా సరఫరా చేస్తున్న త్రాగునీటి సరఫరా కూడా సిబ్బంది చేతివాటం బాగా ప్రదర్శిస్తున్నారు. పైపులైన్ల ద్వారా త్రాగునీరు సరఫరా సక్రమంగా అందని కాలనీలకు ట్యాంకర్ల ద్వారా సరఫరా చేస్తారు. అయితే వాస్తవానికి ఒకటి రెండు ట్యాంకర్లు మాత్రమే పంపించి మిగిలిన ట్యాంకర్లను, హోటల్స్, అపార్టుమెంట్లకు పంపి సొమ్ము చేసుకొంటున్నారు.

అవసరాన్ని బట్టి ఒక్కో ట్యాంకర్ నీటిని 300 నుంచి 500 రూపాయలకు విక్రయిస్తుంటారు. ఈ విధంగా రోజుకు 10వేల నుంచి 20వేల రూపాయల వరకు కార్పొరేషన్ సిబ్బంది సంపాదన వుంటుంది. ట్యాంకర్ నీటిని విక్రయించడం వల్ల వచ్చిన సంపాదనలో కొంత ఇంజినీర్లు తమ వాటా క్రింద తీసుకొని మిగిలిన సొమ్మును సిబ్బందికి పంపకాలు చేస్తుంటారు. నగరంలోని ఎన్ని డివిజన్లకు ట్యాంకర్ల ద్వారా నీటి సరఫరా అవుతుంది? ఎన్ని ట్యాంకర్లను ఉపయోగిస్తున్నారు? వీటి ఖర్చు ఎంత? అన్న వివరాలు ఏమి రికార్డులలో పొందపరచరు. మొత్తం మీద మునిసిపల్ కార్పొరేషన్‌లో ప్రజాధనాన్ని ఇష్టం వచ్చిన రీతిలో కొల్లగొడుతున్నారు. ఎన్నో సంవత్సరాలు నుంచి ఈ తంతు జరుగుతున్నా ఏ అధికారి కూడా దీనిని నియంత్రంచలేక పోతున్నారు. కమిషనర్‌గా ఎవరు బాధ్యతలు చేపట్టిన అధికార పార్టీ నేతల ముందు తలొగ్గుతున్నారు.



# వెనుకబడ్డ సంగీత!

ఖడ్గం సినిమాలో ఒక్క ఛాన్స్ అంటూ తెలుగులో అవకాశాలు దక్కించుకొన్న నటి సంగీత. తెలుగుతోపాటు తమిళంలోనూ నటించిన ఆమె ఈ మధ్యనే క్రిష్ అనే గాయకుడ్ని పెళ్లి చేసుకొంది. పెళ్లికి ముందు కూడా సంగీత సినిమా అవకాశాల కోసం ఎన్నో ప్రయత్నాలు చేసింది. గరమ్ గరమ్ పాత్రల్లోనూ నటించింది. అయినా యువ ప్రేక్షకులను మెప్పించలేక పోయింది. ఇక పెళ్లయ్యాక నేను నటనకు సిద్ధమే అనే సందేశాన్నిచ్చినా ఫలితం లేకపోయింది. దీంతో ఆమె దృష్టి టివి సీరియల్స్‌పై పెట్టింది. ఇటీవల ఓ తమిళ ధారావాహికలో నటించింది. ఈ విషయమై మాట్లాడుతూ సీరియల్స్‌కి పరిమితం కాను. వెండితెరపై కూడా వెలుగుతానంటుంది. ఎంత అనుకున్నా ఒకసారి టివి సీరియల్‌లో పడ్డవాళ్లు వెండితెరపై వెలిగిన దాఖలాలు చాలా తక్కువే.

# పెదరాయుడికి సీక్వెల్!



తెలుగు సినిమా చరిత్రలో రికార్డు వసూళ్లు చేసిన చిత్రంగా మోహన్‌బాబు పెదరాయుడుని చెప్పుకొంటుంటారు. 1995లో విడుదలైన ఈ సినిమా ఘన విజయం సాధించింది. ఈ సినిమాకు రెండో భాగం రూపొందించాలనే ఆలోచన చేస్తున్నాడు మోహన్‌బాబు కుమారుడు హీరో విష్ణువర్ధన్‌బాబు. దీనిలోనూ మోహన్‌బాబు నటిస్తారు. ప్రస్తుతం ఈ సీక్వెల్ కథా చర్చలు ముమ్మరంగా జరుగుతున్నాయి. ఈ సినిమా అంటే విష్ణుకు బాగా ఇష్టమట. అందుకే రెండో భాగం తీయను సిద్ధపడ్డాడు.

# చదువుకొంటూ చిత్రాలకు దూరం



చందమామ చిత్రంలో అందంగా కనిపిస్తూ చక్కగా నటించిన హీరోయిన్ సింధుమీనన్ 'సుభద్ర' సినిమాలో ప్రస్తుతం నటిస్తుంది. షాట్‌గ్యాప్‌లో పిచ్చాపాటీగా మాట్లాడింది. చందమామ సినిమా తర్వాత నాకు ఎంబిఏ పరీక్షలొచ్చాయి. అందుకే చిత్రాల్లోచేసే తీరిక దొరకలేదు. ప్రస్తుతం తెలుగు, తమిళ భాషల్లో నాలుగు సినిమాల్లో నటిస్తున్నాను. పెళ్లిచేసుకొనే వయస్సు ఇంకా రాలేదనుకొంటున్నానంది. నాకు వంట చేయడం బాగానే తెలుసు. పొంగల్ అంటే చాలా ఇష్టం. ఇంట్లో వున్నప్పుడు నేనే చేస్తా. ఆంధ్రా చికెన్, రైస్ పులిహోర కూడా బాగా చేస్తానని వంటా వార్పు గూర్చి చెప్పుకొచ్చింది.

● అన్నిచోట్ల

# ప్రదర్శన కూడదు!

ప్రతిభకన్నా అవకాశం గొప్పదని సినీ పరిశ్రమలో అంటుంటారు. తెలుగులో పలు చిత్రాల్లో నటించిన హీరోయిన్ శ్రద్ధా దాస్‌కు 'మరోచరిత్ర'లో పోషించిన పాత్ర మంచి గుర్తింపు తెచ్చింది. హీరో ప్రభాస్ సరసన డార్లింగ్ చిత్రంలో నటిస్తున్న ఆమె షూటింగ్ గ్యాప్‌లో మాట్లాడింది. ఇష్టం లేకపోయినా పలు చిత్రాల్లో నటించాను. సినిమా పరిశ్రమలో కొత్తగా అడుగుపెట్టే వాళ్లకు ఛాన్స్ వుంటుంది. కానీ ఛాయిస్ వుండదు. నేనేమీ సినిమా కుటుంబం నుంచి రాలేదు. బాలీవుడ్‌లో హీరోయిన్ ఎలా కనిపించినా స్వీకరిస్తారు. తెలుగులో అలా కాదు. కాస్త పరిధి దాటితే అతి చేసినట్టు అనిపిస్తుంది. చేసే సినిమాను బట్టి, ఆ పాత్ర ప్రవర్తించాలి. అవసరం లేనిచోట ఎక్స్‌పోజింగ్ చేసినా ఉపయోగం వుండదంది.





# అందగించని – వరుడు!

✍ అల్లూరు రహీం

స్టైలిష్‌స్టార్‌గా పేరుగాంచిన అల్లు అర్జున్‌ను ఒద్దికైన వరుని పాత్రలో చూపిస్తూ యూనివర్సల్ మీడియా పతాకంపై నిర్మాత డివివి దానయ్య తీసిన చిత్రం పేరుకు తగ్గట్లు గొప్పగా ఏమీలేదు. పెళ్లిచేసి చూడు అంటారు పెద్దలు. పెళ్లంటే అంతా సందడి. ఈ బిజీ రోజుల్లో ప్రక్కవారితో కూడా పలకరింపులు, పట్టించుకోవడాలు తక్కువైన తరుణంలో ఆకాశమంత పందిరివేసి ఆ పెళ్లికి బంధుమిత్ర సపరివారం తరలివస్తే ఎలా వుండాలి? బ్రహ్మాండమే... కాని వరుడు చిత్రానికి కథ, స్క్రీన్‌ప్లేతోపాటు దర్శకత్వ బాధ్యతలు నెరపిన సీనియర్ దర్శకుడు గుణశేఖర్ ఈ చిత్రంలో ఫీల్‌మిస్ చేశాడు. తాతలకాలంలో 16 రోజులు చేసుకొనే పెళ్లిని ఐదు రోజులకు కుదిస్తూ పెళ్లి పందిరి వరకు వెళ్లిన కథ నడతకు ఒక్కసారిగా బ్రేక్ పడిపోతుంది. తెరనిండా నటులున్నా ప్రతినాయక పాత్రధారి తమిళనటుడు సూర్య అందరినీ డామినేట్ చేసి పారేశాడు. అతని ఆంగికం, అభినయం ముందు హీరోయిజం కూడా వెలవెలపోయింది. అదేవిధంగా హీరోయిన్ కూడా అంత అందంగాలేని అమృత్‌సర్ అమ్మాయి భానుశ్రీమెహ్రా ఈ చిత్రం చూడను వచ్చిన యువతను ఆకర్షించదు. ఐదు రోజుల పెళ్లి చరణంతో 18 నిమిషాల పాటు సాగే పాట మినహా మిగతాపాటలు మణిశర్మ సంగీతంలో చెప్పుకోతగ్గవిగా లేవు. ఆయన వేటూరి సుందరరామ్మూర్తి సాహిత్యాన్ని మిగతా పాటల్లో ఖూనీచేసి పారేశాడు. హీరో, హీరోయిన్ పెదాలకు ఇచ్చే ఘాటు ముద్దు కుటుంబసమేతంగా చిత్రానికి వెళ్లిన వారిని మరీ ఇబ్బంది పెట్టేస్తుంది. ఇక్కడ హీరోయిన్ గ్రాంధికంలో పలికే స్వచ్ఛంగా నా మనసుతో నిను రమించాను డైలాగు కూడా గత్తరపెట్టి పారేస్తుంది. అయితే మాటల రచయిత తోటప్రసాద్ వ్రాసిన పుట్టడం, పోవడం తెలియదు... తెలిసి చేసుకొనేదే పెళ్లి. గొప్ప పెళ్లికి విఘ్నాలు జాస్తి. మూడు ముళ్లు మూడు నిమిషాల్లో కావాలి. శీలం మనసుకు సంబంధించింది. సైలెంట్‌గా వుండే వారితో డేంజర్ ఆలోచింపజేస్తాయి.

చిత్రకథలోనికి వెళ్తే ఆశిష్‌విద్యార్థి, సుహాసినిల ఏకైక కుమారుడు సందీప్(అల్లు అర్జున్) నేటితరం యువకుడు. వీకెండ్‌లో పబ్బులలో జల్సా చేస్తుంటాడు. అయితే అతనికి సాంప్రదాయబద్ధమైన వివాహం అంటే ఇష్టం. ఇదే విషయాన్ని తల్లితండ్రులకు చెబుతాడు. ప్రేమించి పెళ్లి చేసుకొన్న వాళ్లిద్దరూ ఆశ్చర్యపోతూ వధువు కోసం వెతుకులాట మొదలుపెడతారు. వీరికి నరేష్, వినయ్‌ప్రసాద్‌ల కుమార్తె దీప్తి(భానుశ్రీమెహ్రా) తారసపడుతుంది. ఆ అమ్మాయి కూడా సాంప్రదాయబద్ధంగా వరుని పెళ్లి పీటలపైనే చూస్తానంటుంది. పెళ్లికి అన్ని ఏర్పాట్లు పూర్తవుతాయి. ఆకాశమంత పందిరి వేస్తారు. బంధుమిత్రులు సపరివార సమేతంగా తరలివస్తారు. అంతే ఒక్కసారిగా పెళ్లి పందిరి కూల్చేసి పెళ్లి కుమార్తెను దివాకర్(సూర్య) ఎత్తుకపోతాడు. దీంతో పెళ్లి ఆగి పెళ్లిపందిరి బోసిపోతుంది. పోలీస్ కమీషనర్(నాజర్) దర్యాప్తు మొదలు పెడతాడు. ప్రభాకర్ ట్రాన్స్‌పోర్ట్ నిర్వాహక సోదరులు ప్రభాకర్(ఆహుతి ప్రసాద్), అతని సోదరుడు దివాకర్ రాక్షస ప్రవృత్తి నిండిన వ్యక్తులు. దివాకర్‌కు నాటకాల పిచ్చి. అతను రంగస్థలంపై ప్రతినాయక పాత్రలు పోషించడంలో దిట్ట. ఓ నాటక ప్రదర్శనలో దీప్తిని చూసి మనసు పారేసుకొని ఆమెను డైరెక్ట్‌గా తనదాన్ని చేసుకొంటానంటాడు. ఆమె చెప్పుతో సమాధానం చెప్పేసరికి రెచ్చిపోయి పెళ్లిపందిట్లో కిడ్నాప్ చేస్తాడు. విషయం తెలుసుకొన్న సందీప్ పెద్ద యుద్ధమే చేసి దివాకర్‌ను తుదముట్టించి దీప్తిని తనదాన్ని చేసుకోవడంతో చిత్రం ముగుస్తుంది.

చిత్ర సమీక్ష

ఇప్పటివరకు కిండల్ పాత్రలు పోషించిన అల్లు అర్జున్ వరుడులో ఒద్దికైన పాత్ర పోషించను కష్టపడ్డాడు. సుహాసిని, ఆశిష్ విద్యార్థి, నరేష్, వినయ్‌ప్రసాద్, సాయాజిషిండే, సింగీతం శ్రీనివాసరావు తమ పాత్రల్లో మెప్పించారు.

మంచి వివాహమే మంచి దాంపత్యం<br>
మంచి దాంపత్యమే మంచి సంతానం<br>
మంచి సంతానమే మంచి సమాజం<br>
మంచి సమాజమే మంచి ప్రపంచం

అంటూ చిరంజీవి కొటేషన్లు చెప్పడంతో మొదలయ్యే ఈ చిత్రం మొత్తానికి సాదాసీదా చిత్రంగానే నిలిచిపోయింది.

# పోలీస్ క్వార్టర్లలో పొంచివున్న ప్రమాదం

ప్రజలకు రక్షణ కల్పించే రక్షక భటులకే రక్షణ కరువైన పరిస్థితి నగరంలో ఏర్పడింది. ప్రభుత్వం కల్పించిన గృహవసతి ఇప్పుడు పోలీసు సిబ్బందికి ప్రాణభీతిని కల్గిస్తుంది. శిథిలమై కూలిపోయేందుకు సిద్ధంగా వున్న పోలీస్ క్వార్టర్స్‌లో నివసిస్తున్న పోలీసు కుటుంబాలు భయం భయంగా రోజులు గడపాల్సి రావడం దురదృష్టకరం. నగరంలో బట్వాడిపాళెం, మూలాపేట, దర్గామిట్ట వద్ద పోలీసు సిబ్బంది నివాసం వుండేందుకు క్వార్టర్లను నిర్మించింది ప్రభుత్వం. ఇరవై ఏళ్ల క్రిందట నిర్మించిన ఈ క్వార్టర్ల ఆలనా పాలనా పట్టించుకోకపోవడంతో అవి కాస్త శిథిలమైపోయాయి. 400 కుటుంబాలు నివాసం వుండే ఈ భవనాల్లో యాభైశాతం ధ్వంసమైపోయాయి. వర్షాకాలంలో అయితే క్వార్టర్లలో వుండే వారి పరిస్థితి మరీ దయనీయం. ఉరవడంతోపాటు గోడలన్నీ కరెంట్ షాక్ కొడుతుంటాయని పలువురు ఆవేదన వ్యక్తం చేస్తున్నారు. పారిశుద్ధ్యం క్షీణించడం, కొన్నిచోట్ల కూలిపోయిన భవనాలు ఈ దుస్థితికి అద్దం పడుతున్నాయి. ఇటీవల ఎఆర్ కానిస్టేబుల్ మహబూబ్ బాషా శ్లాబ్ కూలడంతో తీవ్రగాయాల పాలవడాన్ని చూస్తే ఎంతగా ప్రమాదపుటంచున ఈ క్వార్టర్లు వున్నాయో తెలుస్తుంది. వీటి బాగోగుల గురించి, మరమ్మత్తుల గురించి పట్టించుకోవాల్సిన పోలీసు గృహనిర్మాణ సంస్థ అవేమీ పట్టించుకోక పోవడంతో పోలీసు కుటుంబాలు అరచేతిలో ప్రాణాలు పెట్టుకొని జీవించాల్సిన పరిస్థితులు ఏర్పడ్డాయి. ఉన్నతాధికారులు ఏదైనా సంఘటన జరిగినపుడు స్పందించడం తప్ప భవనాల మరమ్మత్తులకు చర్యలు తీసుకొన్న దాఖలాలు లేవు. పోలీసులకు అండదండలు అందిస్తామని చెప్పుకొనే అసోసియేషన్ నేతలు వీటి గురించి పట్టించుకోకపోవడం విమర్శలకు తావిస్తోంది.


దుస్థితిలో మూలాపేట పోలీసు క్వార్టర్లు.

# పెన్షన్ల ఏరివేతకు సర్వే

జిల్లాలో బోగస్ రేషన్‌కార్డుల ఏరివేతకు నిర్వహించిన సర్వే మాదిరిగా బోగస్ పెన్షన్‌దారులను కూడా గుర్తించేందుకు రాష్ట్ర ప్రభుత్వం నిర్ణయించింది. ఏప్రెల్ 30లోగా పెన్షన్‌దారుల సర్వే పూర్తిచేయాలని జిల్లా కేంద్రానికి ప్రభుత్వం ఇటీవల ఒక సర్క్యులర్‌ను పంపింది. గ్రామీణ ప్రాంతాలలో గ్రామసభలు నిర్వహించి పెన్షన్ పొందుతున్న అనర్హులను గుర్తించాలని ప్రభుత్వం ఆదేశించడం జరిగింది. గ్రామసభలను ఎప్పుడు, ఎక్కడ నిర్వహించే విషయం ముందుగానే ప్రచారం నిర్వహించాల్సి వుంటుంది. గ్రామీణ ప్రాంతాలతోపాటు మునిసిపాల్టీలలో కూడా ఈ సర్వే కార్యక్రమం చేపట్టనున్నారు. గ్రామీణ ప్రాంతాలలో మండల పరిషత్ అభివృద్ధి అధికారులు, మునిసిపాల్టీల పరిధిలో కమీషనర్లు సర్వే కార్యక్రమాన్ని పర్యవేక్షిస్తారు. ఈ సర్వే కార్యక్రమంలో పూర్తికాలం వలసలు వెళ్లిన వారిని గుర్తించి పెన్షన్ జాబితా నుంచి అటువంటి పేర్లను తొలగిస్తారు.

## పథకాలన్నీ రద్దుచేస్తే పోలా?

# ధాన్యంపై నల్ల మచ్చ పేరుతో దగా!

నెల్లూరు సన్నాలు పండించిన రైతులను మిల్లర్లు దగా చేస్తున్నారని కనీస మద్దతు ధర లభించకపోవడంతో రైతాంగం నష్టపోతున్నాదని బిజెపి జాతీయనేత ఎం.వెంకయ్యనాయుడు ఆవేదన వ్యక్తం చేశారు. ఈ అంశంపై పార్లమెంటులో ప్రస్తావిస్తానన్నారు. నగరానికి విచ్చేసిన ఆయన విలేకరులతో మాట్లాడారు. నెల్లూరు సన్నాలు (ఎన్ఎల్ఎ 3994)కు మచ్చ వుందన్న సాకుతో రైతులను నిలువునా మోసం చేస్తున్నారని ఆరోపించారు. జిల్లావ్యాప్తంగా వేలాది మంది రైతులు ఈ పంటను సాగుచేశారు. అమ్మే సమయంలో కనీస మద్దతు ధర రైతులకు లభించడం లేదు. తక్కువ ధరకు కొనుగోలు చేస్తుండడంతో రైతులు తీవ్రంగా నష్టపోతున్నారని చెప్పారు. అధికారులు ఈ విషయంపై తగిన చర్యలు చేపట్టకుండా కాలయాపన చేస్తుండడంతో రైతులకు నష్టం జరుగుతుందన్నారు. దీనిపై పార్లమెంటులో ప్రస్తావించి రైతులకు న్యాయం జరిగేలా చూస్తామన్నారు. రాష్ట్ర ప్రభుత్వం ఎన్నికల ముందు ఒక మాట, తర్వాత ఒక మాట చెప్పి రైతులను వంచిస్తున్నదని విమర్శించారు. ఫ్రీ కరెంట్ అంటూ ప్రకటించిన ప్రభుత్వం ఇప్పుడు నో కరెంట్ అంటున్నాదని ఎద్దేవా చేశారు. గత ఆరు సంవత్సరాలుగా అధికారంలో వున్న కాంగ్రెస్ ప్రభుత్వం ఎంతమేర విద్యుత్ ఉత్పత్తి పెంచిందో చెప్పాలని డిమాండ్ చేశారు. వరద సహాయాన్ని కేంద్రం నుంచి తీసుకురావడంతో రాష్ట్ర ప్రభుత్వం ఘోరంగా విఫలమైందన్నారు. విద్యార్థులకు ఉపకార వేతనాలు అందని పరిస్థితి నెలకొనిందని విమర్శించిన ఆయన విద్యాహక్కు చట్టం తేవడం హర్షించాల్సిన అంశం అన్నారు. ధరల పెరుగుదలపై దేశవ్యాప్తంగా అన్ని రాష్ట్రాల నుంచి సంతకాల సేకరణ చేసి పది లక్షల మందితో ఈ నెల 21న పార్లమెంటు వద్ద ఆందోళన చేపట్టనున్నట్లు వెల్లడించారు. ఈ సమావేశంలో బిజెపి జిల్లా అధ్యక్షుడు ఆంజనేయరెడ్డి, భాస్కర్ గౌడ్ తదితరులు పాల్గొన్నారు.


వెంకయ్య ఆవేదన.

# పిల్లల వినోద ప్రపంచం గేమ్ కింగ్‌డమ్!


గేమ్ కింగ్‌డమ్ ప్రారంభోత్సవంలో ఎస్పీ దామోదర్, ఎమ్మెల్యే వివేకానందరెడ్డి, అధినేత మురళి వున్నారు.

వేసవి వచ్చిందంటే పిల్లలకు ఆడుకొనేందుకు సమయం దొరికినట్లే. సంవత్సరం పొడవునా చిన్నా, పెద్దా అనే తేడా లేకుండా అన్ని తరగతుల విద్యార్థులు పుస్తకాలతో కుస్తీపడి ర్యాంకులే ధ్యేయంగా, మార్కులు సాధించడమే లక్ష్యంగా కాలక్షేపం చేస్తారు. అలాంటి పిల్లలకు వేసవి వినోదాన్ని తెస్తుంది. నగరంలోని చిన్నారులకు నిజంగానే విజ్ఞానంతో కూడిన వినోదాన్ని కల్గించేందుకు మాగుంట లేఅవుట్‌లో సిద్ధం అయ్యింది గేమ్ కింగ్‌డమ్. ఎన్ఆర్ఐ మురళి ఈ వినోద ప్రపంచానికి నిర్వాహకుడు. పిల్లలకు చదువుతోపాటు ఆటలకు అవకాశం లభించినపుడే వారిలో మానసిక వికాసం కల్గుతుందని పలువురు మేధావులు పలుమార్లు వ్యక్తం చేసిన అభిప్రాయం. దీనిని దృష్టిలో వుంచుకొని మహానగరాలకు మాత్రమే పరిమితమైన ఈ క్రీడా ప్రపంచాన్ని నగరంలోని చిన్నారులకు అందుబాటులోకి తీసుకొని వచ్చారు నిర్వాహకులు. కిడ్డీ రైడ్స్, స్కిల్ గేమ్స్, వీడియో గేమ్స్ అని మూడు రకాలుగా దీనిని

## నెల్లూరీయులకు అందుబాటులోకి వచ్చింది

విభజించారు. కిడ్డీ రైడ్స్‌లో బౌన్సీ, గ్లోబ్, బేబి ట్రెన్, డైనోసార్, కిడ్స్ వీడియో కార్, బైక్ వున్నాయి. స్కిల్ గేమ్స్ విభాగంలో బాస్కెట్ బాల్–1, బాస్కెట్ బాల్–2, ఎయిర్ హాకీ, మిస్టర్ క్రోకో, ఫన్‌డ్యాన్స్, స్పీడ్‌బాల్, హిస్టోమిస్, హిట్ ఎ స్టంట్, బాల్ అండ్ బెల్లీ, బెల్లీ బాంబ్ వున్నాయి. వీడియో గేమ్స్‌లో స్పీడ్ ఛాంప్ కార్, జంబో వీడియో కార్, సోనిక్ వీడియో గేమ్, రేస్ బైక్, మొనాకో జిపి కార్ రేస్, ఆర్కెడ్ గన్ షూటింగ్ పిల్లలకు అందుబాటులో వున్నాయి. వేసవిలో చక్కటి వినోదాన్ని అందించాలన్న లక్ష్యంతో ఈ గేమ్ కింగ్‌డమ్‌ను ఏర్పాటుచేసినట్లు అధినేత మురళి తెలిపారు. దీని ప్రారంభోత్సవానికి విచ్చేసి ఎస్పీ దామోదర్, రూరల్ ఎమ్మెల్యే వివేకానందరెడ్డిలు పిల్లలకు చక్కని గేమ్స్‌ను అందుబాటులోకి తీసుకొని వచ్చిన నిర్వాహకులను అభినందించారు. ఈ కార్యక్రమంలో బాలాజీ చౌదరి, ఆచార్య ఆదిత్య, చాట్ల నరసింహారావు తదిత

# నెల్లూరు ఇన్‌ఛార్జి ఎంఇఓకు లంచాల పిచ్చి!



నెల్లూరులోని ఎంఇఓ కార్యాలయం.

విద్యాశాఖ గురించి, అధికారుల అవినీతి గురించి పలుమార్లు ప్రస్తావించుకొన్నా ఇంకా కొండవీటి చాంతాడంత వుంటున్నది. కార్పొరేట్ స్కూళ్ల విద్యాశాఖ సిబ్బందికి బంగారు గుడ్లుపెట్టే బాతుల్లా మారడంతో ఎవరికి తోచినంతవారు దోచుకొంటున్నారు. ఇన్‌ఛార్జి ఎంఇఓగా విధులు వెలగబెడుతున్న ఓ అధికారి అవినీతిలో తన స్టైలేవేరని నిరూపిస్తున్నాడు. నగరంలో విద్యాసంస్థలతోపాటు రూరల్ మండలంలోని స్కూళ్లు ఈ అధికారి కంట్రోల్‌లో వుంటాయి. ఒకటి రెండు స్కూళ్లు తప్ప అధిక సంఖ్యలో పాఠశాలలు ప్రభుత్వం నిర్దేశించిన నిబంధనలకు అనుగుణంగా వుండవు. ఇదే అధికారులకు లాభించే అంశం. ఈ ఇన్‌ఛార్జ్ ఎంఇఓ నగరంలోని పలు పాఠశాలల తనిఖీకి వెళ్లి బెదిరించి డబ్బులు వసూలు చేయడం గగ్గోలు రేగింది. కొందరు ఆ అధికారి అడిగినంత ముట్టజెప్పగా భక్తవత్సలనగర్‌లో గల పాఠశాల కరస్పాండెంట్ తిరగబడ్డాడట. మీ మామూళ్లు మీకు ఇస్తున్నాం గదా ఇప్పుడొచ్చి అడిగితే ఎలా ఇస్తాం, ఇచ్చేది లేదు చేతనైంది చేసుకోమనడంతో బిత్తరపోయిన ఆ అధికారి చల్లగా జారుకొన్నాడట. ఈయన అసలు బాధ్యత ఉర్దూ స్కూళ్ల తనిఖీ. డిప్యూటీ ఇన్స్‌పెక్టర్‌గా పనిచేస్తున్న ఆయనకు ఎంఇఓ బాధ్యతలు అదనం. ఈ అవకాశాన్ని ఆ అధికారి రెండు చేతులా సంపాదించుకొనేందుకు వినియోగించుకొంటున్నాడట. మూలాపేట బాలికల హైస్కూల్‌లో డిఐ కార్యాలయం వుంది. అక్కడ ఇద్దరు అసిస్టెంట్లు వుంటారు. వీరుకాక ఎంఇఓ కార్యాలయంలో ఆరుగురు సిబ్బంది పనిచేస్తారు. ఇంతమందీ చాలదన్నట్లు ఆయన రూరల్ మండలంలో పనిచేసే నలుగురు టీచర్లను తనతోపాటు తిప్పుకొంటూ వుంటాడట. వీరిద్వారా అవినీతి కార్యకలాపాలు చక్కబెడతారనేది ప్రచారంలో వుంది. ఈ అధికారి వస్తున్నాడంటేనే ప్రైవేట్ పాఠశాలల యాజమాన్యాలు హడలిపోయి మేము భరించలేము మహాప్రభో అంటూ డిఇఓకు ఫిర్యాదు చేశారంటే ఎంతగా అవినీతి అక్రమార్జన పెచ్చుమీరింది అవగతమవుతుంది.

## లొంగుబాటా

మొదటి పేజీ కొరవ

రాజీనామాలు చేసి గౌరవంగా బయటపడి మీతోనే వస్తాము, అయితే ఆ క్షణం నుంచి మా రాజకీయ భవిష్యత్తు శూన్యమై పోతుందని మాత్రం మీరు అర్థం చేసుకోవాలి. మీరు తప్పదంటే అందుకు మేము సిద్ధం అని నిష్టూరంగా మాట్లాడారట. ఆనం రామనారాయణరెడ్డి, రఘువీరారెడ్డి, వట్టి వసంత కుమార్, విశ్వరూప్ వంటి మంత్రులు ఈ జగన్ రాయబారంలో వున్నారు. వారి ఆవేదన, భయం చూసిన జగన్ పునరాలోచనలో పడ్డాడు. కెవిపి ఎంత చెప్పినా తలకెక్కని నిజాలు, మంత్రుల రోదనతో బాగా వంటబట్టాయి. సరే ఒక ప్రయత్నం చేసి చూద్దాం అనే నిర్ణయానికి వచ్చాడట. ఆ వెంటనే రోశయ్యకు సందేశం వెళ్లింది. మీరు సరే అంటే వచ్చి కలుస్తానని చెప్పి పంపాడు. ఆయన ఒకే చెప్పాడు. ఇద్దరి మధ్య భేటీ జరిగింది.

ఆ భేటీలో రాజకీయ ఒప్పందాలే కాక, పలు వ్యాపార ప్రయోజనాలను కూడా కోరినట్లు తెలుస్తున్నది. తన వారనుకొన్న మంత్రులను దయ చూడమని కోరాడట జగన్. అందుకు రోశయ్య సానుకూలంగానే స్పందించినట్లు చెప్తున్నారు. మచిలీపట్నం ఓడరేవు, పోలవరం టెండర్ తదితరాలలో జగన్ ప్రయోజనాలను కాపాడదానికి అంగీకరించాడు రోశయ్య. కథ సుఖాంతం అయ్యింది. ఇక నుంచి ఏది చేయాలన్నా ఇద్దరం కలిసి మాట్లాడుకొని, నిర్ణయాలు తీసుకొందామని అనుకొన్నారట. దానితో సంతోషంగా ఇంటికి తిరిగి వెళ్లాడు జగన్.

అయితే ఇది రోశయ్యతో సర్దుబాటా లేక లొంగుబాటా అన్నది ప్రశ్న. మంత్రుల ఒత్తిడి వల్లనే ఈ భేటీకి జగన్ సిద్ధపడ్డాడన్నది అందరికీ తెలిసిన నిజం. కానీ అరునెలల పాటు తనను రాచి రంపాన పెట్టి, చివరలో తన ఇంటికి వచ్చి విందు ఆరగించి పోయినంత మాత్రాన, జగన్‌ను నమ్మేస్థితిలో రోశయ్య వున్నాడా అన్నది మరొక ప్రశ్న. వేల కోట్ల రూపాయల విలువ చేసే వ్యాపార అవసరాలు వుండడం, తన మనిషి అన్న మంత్రినల్లా వూడబెరికే పరిస్థితి కళ్లముందు కన్పించడంతో విధిలేక తన వద్దకు వచ్చాడే తప్ప, రేపు ఏ మాత్రం అవకాశం దొరికినా తనను కాళ్లుపట్టి ఈడ్చి పారేయడం ఖాయం అన్న నిజం ముఖ్యమంత్రికి బాగా తెలుసు. అయితే తనంత తానుగా ఇంటికి వచ్చిన వ్యక్తితో తగవు కొనసాగించాడన్న నింద తన మీద పడకుండా చూసుకోవడానికి జగన్ అడిగిన వ్యాపార అవసరాలు క్షణం ఆలస్యం చేయకుండా చేసి పారేశాడు రోశయ్య. అంతకు మించి ఇద్దరి మధ్య రాజకీయ స్నేహం, అవగాహన కుదురుతాయని ఆశించడం మాత్రం పొరపాటు అవుతుంది.

## మనసంతా దిగులు

16వ పేజీ కొరవ

అత్యంత కీలక శాఖ, వీలైతే ఉపముఖ్యమంత్రిత్వం కూడా ఇవ్వాలని రోశయ్య తలపోస్తున్నాడట.

తెలంగాణ ఉద్యమాన్ని మరింత అణిచి వేయడానికి ఒక తెలంగాణవాదికి ఉప ముఖ్యమంత్రిత్వం ఇవ్వాలని కేంద్ర నాయకులు సలహాయిస్తున్నారు. ఈ పదవి కోసం ఇప్పటికే గీతారెడ్డి ఢిల్లీలో పెద్ద ఎత్తున ప్రయత్నాలు చేస్తున్నారు. కానీ రోశయ్య మాత్రం మర్రి శశిధర్‌రెడ్డి పట్ల సుముఖత చూపుతున్నాడని చెప్తున్నారు.

### ఆనంకు వూరట

జగన్, రోశయ్య భేటీ వల్ల నెల్లూరుజిల్లా మంత్రి ఆనం రామనారాయణరెడ్డికి చెప్పలేని వూరట లభించింది. మంత్రివర్గ విస్తరణలో ఆయన పదవి గోవిందా కొట్టడం ఖాయమని దాదాపుగా అందరూ ఏకాభిప్రాయానికి వచ్చారు. అయితే జగన్, రోశయ్యల భేటీ వల్ల అది జరగకపోవచ్చునని, రామనారాయణరెడ్డి మరి కొంతకాలం మంత్రిత్వభోగం అనుభవించే అవకాశం వుందని చెప్తున్నారు.

### కన్నా బేరం ఐదు కోట్లు

తొలగింపు జాబితాలో ప్రముఖంగా వినపడిన మరొకపేరు కన్నా లక్ష్మీనారాయణ. గుంటూరు జిల్లాకే చెందిన కన్నా పట్ల రోశయ్య గారికి సదభిప్రాయం లేదు. జిల్లా రాజకీయాలలో కన్నాను అణచి వేయాలన్నది ఆయన అభిప్రాయమట. ఇది గ్రహించిన కన్నా లక్ష్మీనారాయణ తన పదవి కొనసాగిస్తే, ఐదు కోట్ల రూపాయలిస్తానని తమ జిల్లాకే చెందిన ఒక వైశ్య ప్రముఖుడి చేత రాయబారం నడిపాడట. అయితే ఆ ప్రయత్నం రోశయ్యను మరింత ఆగ్రహానికి గురి చేసిందని తెలుస్తున్నది.

### పీలేరుకు ఆది అండ

చిత్తూరు జిల్లాకు చెందిన పీలేరు రామచంద్రారెడ్డి తన పదవి కాపాడుకోవడానికి టిటిడి ఛైర్మన్ ఆదికేశవులు నాయుడును ఉపయోగిస్తున్నారు. రోశయ్యకు, ఆదికేశవులుకు దగ్గరి సంబంధాలున్నాయి. ఇద్దరూ మంచి స్నేహితులు. ఆ స్నేహ బంధంతోనే ఆదికేశవులు బావ, ఒకప్పుడు నెల్లూరులో విద్యుత్‌శాఖ ఉన్నతాధికారిగా పని చేసిన రంగనాథాన్ని ట్రాన్స్‌కో జాయింట్ మేనేజింగ్ డైరెక్టర్‌గా నియమించాడు రోశయ్య. ఐఎఎస్ అధికారులు నిర్వహించే బాధ్యతను ఒక రిటైర్డ్ అధికారికి అప్పచెప్పడంలోనే ఆదికేశవులు పట్ల రోశయ్యకు గల సాన్నిహిత్యం ఎంతటిదో అర్థం చేసుకోవచ్చు. అందువల్ల ఆ ఆదినే తన బ్రహ్మాస్త్రంగా ప్రయోగించాడు పీలేరు రామచంద్రారెడ్డి.

## భారీ నజరానా

మొదటి పేజీ కొరవ

బొంబాయి కంపెనీ ద్వారా ఈ లావాదేవీ నడిచింది. అయితే రోశయ్య అధికారంలోకి వచ్చిన తర్వాత మచిలీపట్నం ఓడరేవును టెండర్లు లేకుండా నవయుగ కంపెనీకి ఇవ్వడానికి అధికారులు ఒప్పుకోలేదు. అది విమర్శలకు దారితీస్తుందని ఫైల్ మీద అడ్డం వ్రాశారు. రోశయ్య కూడా అధికారుల వాదననే సమర్థించి, ఫైల్ ప్రక్కన పెట్టాడు. ఇప్పుడు జగన్ తనను కలిసి వెళ్లగానే, ఆ ఫైలుకు దుమ్ము దులిపి, మంత్రివర్గ సమావేశంలో ఆమోద ముద్ర వేయించాడు.

ఈ భేటీ వల్ల జగన్‌కు లభించిన రెండవ నజరానా, పోలవరం ప్రాజెక్ట్ కాంట్రాక్ట్ రద్దు. పోలవరం ప్రాజెక్ట్‌లో విద్యుత్ కేంద్రాన్ని కూడా ఒక భాగం చేసి, ఒకే టెండర్ పిలిచి, దాన్ని తన హస్తగతం చేసుకోవాలని వైఎస్ వున్నప్పుడే జగన్ ప్రయత్నం చేశాడు. అందులో భాగంగా, పోలవరం కాంట్రాక్టర్లను పిలిపించి వారు తమంతట తాముగా టెండర్ అగ్రిమెంట్లు రద్దు చేసుకొనేట్లు ఒప్పించాడు. తమ మాట విన్నందుకు కృతజ్ఞతగా ఆ కాంట్రాక్టర్లకు దాదాపు 450 కోట్ల రూపాయలు పరిహారం చెల్లించేట్లు ప్రభుత్వం చేత స్టాంప్ పేపర్ మీద హామీ పత్రం వ్రాయించాడు వైఎస్. వైఎస్ మరణించిన రోజే పోలవరానికి కొత్త టెండర్లు పిలిచే ప్రకటన వెలువడవలసి వుండింది. వైఎస్ శవం కోసం ఒకవైపు వెతుకులాట నడుస్తున్నప్పుడే, ఈ టెండర్ల పని మరొక ప్రక్క నడిచింది. అది తెలిసి, సోనియాగాంధీ మండిపడడంతో ఆ ఫైల్ పక్కన పడేశారు. కానీ జగన్‌తో రోశయ్య భేటీ జరిగిన వెంటనే ఆ ఫైల్‌కు కూడా మోక్షం లభించింది. అత్యవసరంగా అధికారుల సమావేశం జరిపి, పాత కాంట్రాక్టర్ల ఒప్పందాల రద్దుపై ఉత్తర్వులు విడుదల చేసింది ప్రభుత్వం.

మొత్తానికి రోశయ్యతో కలయిక వల్ల కొన్ని వేల కోట్ల రూపాయల వ్యాపార ప్రయోజనాలను సాధించుకోగలిగాడు జగన్.

## నెల్లూరుముచ్చట్లు

3వ పేజీ కొరవ

### జనాభా లెక్కింపు!

జిల్లాలో జనాభా లెక్కింపు కార్యక్రమం ఈ నెల 26వ తేది నుంచి జూన్ 10వ తేది వరకు జరుగుతుంది. దీనికిగాను 102 మంది మాస్టర్ ట్రైనీలకు శిక్షణ కూడా మొదలయ్యింది. ఈ కార్యక్రమంలో పాల్గొనే సిబ్బందికి ఆర్జిత సెలవులు, ఇతర త్రా ప్రత్యేక సౌకర్యాలు కల్పిస్తున్నందున ఈ బాధ్యత నిర్వహణకు ఉద్యోగులు ఎగబడుతున్నారు.

## సవరణ

గతవారం 'నెల్లూరు ముచ్చట్లు'లో ఆదాలను సత్కరించిన గవర్నర్ శీర్షికతో ప్రచురితమైన వార్తల్లో గవర్నర్ నరసింహన్‌గా పేర్కొనవలసింది పోయి రంగరాజన్ అని పొరపాటుగా వ్రాసినందుకు చింతిస్తున్నాం.

## జనవాణి

2వ పేజీ కొరవ

రిజర్వేషన్ పరిమితమై వుండింది. రాజకీయులు తమ లబ్ధికోసం అదే మతానికి చెందిన ఎన్నో కులాలను రిజర్వేషన్ పద్దులో చేర్చించడమేగాక ఆదాయ, కాల పరిమితిని పెంచుకొంటూ పోయారు. దేశంలో మైనార్టీ కులస్తులలో ఒకరైన ముస్లింలకు స్వర్గీయ వైఎస్.రాజశేఖర్‌రెడ్డి కల్పించిన రిజర్వేషన్ల మూలంగా సామాజికంగా ఆర్థికంగా వెనుకబడిన వారికి ఎంతో మేలు జరిగింది. దీన్ని సహించలేని కొన్ని వర్గాలు కోర్టుకు వెళ్లినా సుప్రీంకోర్టు పేదరికంతో అల్లాడుతున్న ముస్లింలలోని వెనుకబడిన కులాలకు రిజర్వేషన్లు వర్తింపజేయడం తప్పుకాదంటూ మధ్యంతర తీర్పు చెప్పి అంతిమవిజయం న్యాయానిదేనని చాటిచెప్పింది.

ఎన్.రామచంద్రారెడ్డి, చెన్నై

## జి.ప.ఛైర్మన్ పదవికే వన్నె తెచ్చారు!

జిల్లా పరిషత్ పరిపాలనలో నూతన అధ్యాయానికి తెరతీశారు ఛైర్మన్ కాకాణి గోవర్ధన్‌రెడ్డి. ఇసుక రీచ్‌లలో కుంభకోణం బయటకు తీసి ప్రభుత్వ ఖజానాలో కోట్లాది రూపాయలు జమ అయ్యేలా చేశారు. నెల్లూరులోని పెద్దాస్పత్రి, జూబ్లీ ఆస్పత్రి, క్షయాస్పత్రిలతోపాటు హాస్టళ్లను నిరంతరం తనిఖీ చేస్తూ అక్కడ జవాబుదారీతనం పెరిగేలా చేశారు. జిప స్కూళ్లలో టెన్త్ చదివే విద్యార్థులకు లక్షలాది రూపాయల ప్రోత్సాహక బహుమతులతో పాటు పొదలకూరు మండలంలో పేదలకు ఇంది రమ్మ గృహ నిర్మాణాలకు సొంత నిధులు వెచ్చించడం హర్షణీయం.

రాయసం రాంబాబు, నెల్లూరు

## కావలి రాజకీయం

16వ పేజీ కొరవ

రికి పుట్టిన బిడ్డవురా వెక్కివెక్కి ఏడ్చేవు అన్న చందంగా వుంది. మాగుంట కుటుంబీకులు ఎన్నికలలో పోటీ చేసినంత కాలం కావలి కాంగ్రెస్‌వాదులకు నిత్యకళ్యాణం పచ్చతోరణంగా నడిచింది. ఎన్నికలలో చేతి నిండా డబ్బు. ఆ తర్వాత చేసుకొన్నన్ని పనులు, వాటి రాబడి. అందరూ సంతోషంగా నాలుగు రూకలు కూడబెట్టుకొనే వారు. కానీ విష్ణు పేరులో మాత్రమే వైష్ణవాలయం, రాజకీయం తీరు శైవాలయం. ఆర్థికంగా ఆయన నుంచి ఎవరూ ఎటువంటి ప్రయోజనాలూ ఆశించలేరు. పైపెచ్చు ఆయనతో తిరిగే వారికే జేబు ఖర్చు. కానీ కావలి ఇన్‌ఛార్జిగా వైఎస్ ఆయన్నే కొనసాగించడంతో ఇంతకాలం ఇష్టం లేకున్నా సర్దుకపోయారు. ఇప్పుడు వైఎస్ విగ్రహ ప్రతిష్ఠాపన కోసం పార్వతమ్మ మళ్లీ కావలిలో రంగ ప్రవేశం చేశారు. దానితో అందరికీ పళ్లు పులుస్తున్నాయి. ఆమె రాజకీయం నెరపితే తమకు నిత్యం చక్కెర పొంగలి దొరుకుతుందని ఆశ. కానీ ఆ ప్రయత్నాలకు విష్ణు కాలు అడ్డం పెడుతున్నారు. ఇప్పుడు పార్వతక్కను కావలికి అనుమతిస్తే రేపటి ఎన్నికలలో టిక్కెట్‌కు కూడా పోటీ అవుతుందన్నది ఆయన భయం. దానితో వైఎస్ విగ్రహ ప్రతిష్ఠాపనకు మునిసిపల్ అనుమతి రాకుండా అడ్డుపుల్ల వేశాడు. మునిసిపల్ తీర్మానం లేనిదే విగ్రహాన్ని వీధిలో నిలబెట్టడానికి లేదు. ఇది పార్వతమ్మకు మనస్తాపం కల్గిస్తున్నది. తన వల్ల ఎవరూ ఇబ్బంది పడకూడదనే మంచి తనంతో మెలిగే తాను చేపట్టిన చిన్న విగ్రహ ప్రతిష్ఠాపనను అడ్డుకోవడం ఆమెను బాధ పెడుతున్నది. ఇదే సందని కొందరు కావలీయులు విష్ణుకు, పార్వతమ్మకు మధ్య గొడవ పెద్దది చేయడానికి ఆజ్యం పోస్తున్నారు. మొత్తం మీద వైఎస్. సాక్షిగా కావలి రాజకీయం సెగలు పొగలు కక్కుతున్నది. దీన్ని ఎవరు ఎట్లా చల్లారుస్తారో వేచి చూడాలి.


### ప్రకటన

యిందుమూలంగా తెలియచేయునది. మా కక్షిదారుడు అయిన నెల్లూరువాసి శ్రీ మేనకూరు ఆదిశేషారెడ్డి గారి కుమారుడు శ్రీ వెంకట రమణారెడ్డి తనకు రావలసిన బాకీ రాబట్టుకొను నిమిత్తం నెల్లూరు కాపురస్తుడు శ్రీ యేటూరు గోవిందరెడ్డి గారి కుమారుడు శ్రీ పరంధామరెడ్డి గారిపైన నెల్లూరు ప్రిన్సిపల్ సీనియర్ సివిల్ జడ్జిగారి కోర్టులో దావా నెం.577/09 దాఖలు చేసి అందులో పిటిషన్ నెం.866/09 క్రింద ఆస్తిని జప్తు చేయించియున్నారు. సదరు ఆస్తిని గురించి ఎటువంటి అన్యాక్రాంతములు చెల్లనేరవని తెలియపర్చుచున్నాము.

**ఆస్తి వివరములు**

నెల్లూరు మునిసిపాలిటీ బిట్-II పట్టా నెం.71 సర్వే నంబరు 1391/1 యం2.59సెంట్లు అప్రూవ్డ్ లేఅవుట్ డిడియన్ 59/69లో ప్లాటు నెం.09లో 43 అంకణముల 24 చ.అడుగుల ఖాళీ స్థలం.

**హద్దులు:** 16.9.82తేది విక్రయ పత్రంలో కనుపరిచినవి.

తూర్పు : రోడ్డు; దక్షిణం: ప్లాట్ నెం.10; పడమర: ప్లాట్ నెం:5; ఉత్తరం: పేరారెడ్డిగారి భూమి.

ఎ.ప్రసాద్‌రెడ్డి,
పి.ఉమామహేశ్వర్‌రెడ్డి
అడ్వకేట్లు, నెల్లూరు.

# అధికారులపై కస్సు బుస్సుమన్న మంత్రి!

రాష్ట్ర పురపాలకశాఖ మంత్రి ఆనం రామనారాయణరెడ్డి ఈనెల 6వ తేది నిర్వహించిన సమీక్షా సమావేశంలో అధికారులను ఖంగు తినిపించారు. కలెక్టరేట్ ప్రాంగణంలోని గోల్డెన్‌జూబ్లీ హాలులో వివిధ శాఖలకు చెందిన అధికారులతో పలు అంశాలపై మంత్రి చర్చించారు. భూపంపిణీ, ఉపాధిహామీ పథకం, వ్యవసాయశాఖ, ప్రజాపథం, రైతు సదస్సుల ఏర్పాటు తదితర అంశాలు ఇందులో వున్నాయి. తొలుత వ్యవసాయశాఖపై చర్చించిన మంత్రి అధికారుల తీరు పట్ల తీవ్ర అసంతృప్తి, అసహనం వ్యక్తం చేయడం జరిగింది.

రైతుల సంక్షేమం కోసం రాష్ట్రప్రభుత్వం కోట్ల రూపాయల నిధులు కేటాయించి పథకాలను అమలు చేయమని ఆదేశిస్తే జిల్లా వ్యవసాయశాఖ అధికారులు చాలా నిర్లక్ష్యంగా వ్యవహరిస్తున్నారని సునిశిత వ్యాఖ్యలు చేశారు. ముఖ్యంగా రైతులకు వ్యవసాయపరంగా అవసరమైన మట్టి నమూనాలను సేకరించి పరీక్షలు చేయడంలో వైఫల్యం చెందారని అసహనం వ్యక్తం చేశారు. మట్టి నమూనా పరీక్షలు చేయకపోవడం వలన రైతులు పంట దిగుబడి రాక ఆర్థికంగా నష్టపోవాల్సిన పరిస్థితులు తలెత్తుతున్నాయని మంత్రి వ్యాఖ్యానించారు. రాష్ట్రవ్యాప్తంగా పేరుగడించిన నెల్లూరు సన్నాల రకం ధాన్యానికి నల్లమచ్చ వుందన్న నెపంతో వ్యాపారులు కొనుగోలు చేసేందుకు ముందుకు రావడం లేదని దీనిపై అధికారులు దృష్టి సారించి రైతులు పండించిన ధాన్యానికి గిట్టుబాటు ధర కల్పించేందుకు చర్యలు తీసుకోవాలని కోరారు.

గ్రామీణ ప్రాంతాలలో గతంలో ఏర్పాటు చేసిన రైతుమిత్ర గ్రూపులు సక్రమంగా పని చేయడం లేదని కేవలం కొంతమంది వ్యక్తులు మాత్రమే గ్రూపుల పేర్లు చెప్పుకొని వ్యక్తిగతంగా లబ్ధిపొందుతున్నారని దీనిని అధికారులు ఎందుకు గమనించడంలేదని మండిపడ్డారు. జాతీయ గ్రామీణ ఉపాధిహామీ పథకంలో రైతులను భాగస్వామ్యం చేయాలన్న నిబంధన వున్నప్పటికీ ఇది ఎందుకు అమలు కావడం లేదని ప్రశ్నించారు.

## భూపంపిణీపై చర్చ!

ఈనెల 14వ తేది అంబేద్కర్ జయంతి సందర్భంగా జిల్లాలో 5వ విడత భూపంపిణీ కార్యక్రమానికి రాష్ట్రప్రభుత్వం శ్రీకారం చుట్టింది. 2005 సంవత్సరం నుంచి జిల్లాలో నాలుగు విడతలుగా చేపట్టిన భూపంపిణీ కార్యక్రమంలో దాదాపు 47వేల 43 ఎకరాలను అందజేయడం జరిగింది.

5వ విడత చేపట్టే భూపంపిణీలో 6,815 ఎకరాలను 5,539 మందికి పంపిణీ చేయాలని అధికారులు నిర్ణయించారు. ప్రస్తుతం జిల్లాలోని 10 అసెంబ్లీ నియోజకవర్గాలు వుండగా 8 నియోజకవర్గాల్లోని 31 మండలాల్లో భూపంపిణీ జరగనుంది. నెల్లూరు రూరల్, నెల్లూరు సిటీ అసెంబ్లీ నియోజకవర్గాలను భూపంపిణీ కార్యక్రమం నుంచి మినహాయించారు. భూపంపిణీ చేపట్టే 8 అసెంబ్లీ నియోజకవర్గాలలో అసైన్‌మెంటు కమిటి సమావేశాలు స్థానిక ఎమ్మెల్యేల అధ్యక్షతన జరుగుతున్నాయి.



సమీక్షా సమావేశంలో మాట్లాడుతున్న మంత్రి ఆనం రామనారాయణరెడ్డి. ప్రక్కన ఎమ్పీ మేకపాటి రాజమోహన్‌రెడ్డి, జిల్లా కలెక్టర్ రాంగోపాల్.

రైతులకు పంపిణీ చేసే భూములను అభివృద్ధి చేసుకునేందుకు ఎకరాకు 17వేల రూపాయల వంతున ప్రత్యేక ప్యాకేజీ ద్వారా అందించే ఏర్పాట్లుచేస్తారు. ఇందుకు ఒక్కో అసెంబ్లీ నియోజకవర్గంలో ఒక ఆదర్శ గ్రామాన్ని ఎంపిక చేసి అమలుచేయనున్నారు. సమీక్షా సమావేశంలో మంత్రి ఎన్నడు లేని విధంగా అధికారుల తీరును తప్పుబట్టడంతోపాటు ఘాటుగా వ్యాఖ్యలు చేయడంతో అధికారులు ఖంగు తినాల్సివచ్చింది. ఈ నెల 19వ తేది నుంచి చేపట్టనున్న ప్రజాపథం కార్యక్రమాన్ని పటిష్టంగా చేపట్టేందుకు ముందస్తు ప్రణాళిక రూపొందించుకోవాలని ఆదేశించారు.

గతంలో నిర్వహించిన ప్రజాపథం కార్యక్రమం సందర్భంగా చోటుచేసుకున్న పరిణామాలను దృష్టిలో వుంచుకొని అందుకు భిన్నంగా వ్యవహరించాలని సూచించారు. నెల్లూరు ఎమ్పీ మేకపాటి రాజమోహన్ రెడ్డి రైతులకు సరైన సలహాలిచ్చి వ్యవసాయరంగం పట్ల అవగాహన కల్పించాలన్నారు. ఈ సమావేశంలో ఎమ్మెల్యేలు ఆనం వివేకానందరెడ్డి, మేకపాటి చంద్రశేఖర్‌రెడ్డి, జిల్లా కలెక్టర్‌రాంగోపాల్, ఎస్పీ దామోదర్ తదితరులు పాల్గొన్నారు.

# సంక్షుభిత 'జీవితం' నుంచి 'నది'లా ప్రవహించిన కవి 'మోహన నాగేశ్వరరావు'!

'నెరజాణల గడ్డ, విక్రమ సింహపురి సీమలో పుట్టిన చిగురు కొమ్మైన చేవ' అని నేనంటున్నాను. మహాకవి తిక్కన, కవిసార్వభౌముడు శ్రీనాథుడు, తెలుగు మధురిమల రుచుల మహావిదుషి ఆతుకూరి మొల్లమ్మ ఈ గడ్డవారే. వారి తోబాటు నిన్న వెళ్ళిపోయిన మోహన నాగేశ్వరరావు మహాప్రస్థానం తర్వాత మనం అర్థం చేసుకోవలసింది ఒక్కటే! 'సంక్షుభిత' జీవితంలో అన్ని ప్రయాణాలు, ప్రమాణాలు దృశ్యాలై, అదృశ్యమై వెళ్లిపోతాయని, చేసిన మంచి పనులు, రాసిన 'అక్షరాలు' స్థిరస్థాయిగా నిలిచిపోతాయని, మనల్ని కలకాలం జీవింపజేస్తాయని, ఎవరైనా జీవితాన్ని గురించి అర్థం చేసుకోవలసిందిదే!

మోహన నాగేశ్వరరావంటే నెల్లూరీయులకు తెలియకపోవచ్చు. 'మోనా' అంటే ఇట్టే గుర్తుపట్టేస్తారు.

నేను నెల్లూరు వచ్చాక 'ఇక్కడ' సాహిత్య కార్యక్రమాల నిర్వహణకు ఓ చేదోడు ఎవరని ఆలోచిస్తున్న తరుణంలో సుమనస్వి, అపర సాహిత్య భోజుడు ఆర్వీ నాగరాజును, అతని మిత్రుడు ప్రభాకర్‌రెడ్డిని పరిచయం చేసినవాడు 'మోనా'. ఆ తర్వాత కొన్నేళ్లు సాహిత్య కార్యక్రమాల్ని విందు భోజనాలతో పెళ్లిళ్లలా చేయగలిగాను. దారిచూపినవాడు 'మోనా'. ప్రతిఫలాన్ని ఆశించనివాడు కూడా 'మోనా'.

'మోనా' 'జీవితం' 'నది' కావ్యాలు రాశాడు. "మా నెల్లూరోళ్లు మహాఘటికులుగదో" అని నెల్లూరుపై విపరీతమైన అభిమానాన్ని చాటే బెజవాడ గోపాలరెడ్డి అభిమానాన్ని చూరగొన్నాడు. మహాకవి ఆశాన్ అవార్డును అలంకరించుకొన్నాడు.

"నిత్యం నాపై అవ్యాజ వాత్సల్యం కురిపించే మహా మనిషి బెజవాడ గోపాలరెడ్డి గారు" అని తనూ కృతజ్ఞతలు తెలియజెప్పుకున్నాడు.

'జీవితం', 'నది' కావ్యాలు రెండూ కూడా

**పాయసం సుబ్రహ్మణ్యమహర్షి**

కవిత్వపు ప్రవాహాలే. అందులో అస్పష్టపు 'సింబలిజం' లేదు. భావాలకు ఆడంబరాలు లేవు. భూషలు లేవు, వేషాలు లేవు, తొడుగులు లేవు, మనసు నుంచి నగ్నంగా ఉద్వేగ్నంగా కొనసాగే కవిత్వాలవి.

నేనుగా, కాక మహాకవి మాధ్యూ ఆర్నార్డ్‌గా చెప్పాలంటే 'మోనా' కవిత్వం "Spontanious Over Flow Of His Powerfull Feeling" ఈ విషయం అక్షర సత్యం కూడా.

జీవితం "ఎడతెగని భావాల ప్రవాహం" అంటాడు మోనా. జీవితం కావ్యంలో ఒకచోట వయసులో ఉన్నప్పుడు ఆంగ్ల, సంస్కృతాలు బాగా చదువుకున్నాడు. తన ఉపన్యాసాలలో ఆ భాషా పాండిత్యాల పటిమను చాటేవాడు. విచారించవలసిన విషయం ఏమిటంటే సాహిత్య విమర్శ కొండెక్కిపోయిన ఆంధ్రదేశంలో అతను గొప్ప సాహిత్య విమర్శకుడు కావలసినవాడు. అతనిపై నేను ఎంత వత్తిడి తెచ్చినా అది వృథా ప్రయాసే అయింది.

జీవితం, నది కావ్యాలు రాశాక అతను రాయని భాస్కరుడై మిగిలిపోయాడు. స్నేహితులతో ఉమర్ ఖయ్యూమ్ ఆత్మతో గడిపేవాడు.

"మద్యంతో అదే శూన్యానికి / కైపెక్కించి / మచ్చిక చేయాలని చూశాను" అంటాడొక చోట అనారోగ్యాల ముప్పేటల దాడితో అదీ సాధ్యమైనట్లు లేదు.

జీవితం కావ్యంలో ఒకచోట అంటాడు కదా! "ఏకాకిగా గమ్యం లేక / సముద్రపుటాడ్డున నడుస్తూ / హోరెత్తించే అలలలో / ఏవో అస్పష్టపు ఘోషలు వింటూ" కాలాన్ని గడిపేశాడు.

మోనా కవిత్వంలో నాకు నచ్చిన భావుకత వుంది అంటాడు కదా! అందరినీ, అన్నింటినీ / తెగదెంచుకొని / చిరునామా తెలియని చోటికి /



పయనించే ఉత్తరం జీవితం"

'మోనా' మరణించేవరకు మౌనంగా ఉండిపోయాడు.

'ఒంటరి జీవితంలో అతను కవిత్వాన్ని ప్రభావితం చేశాడు తప్ప కవిత్వం అతణ్ని ప్రభావితం చేయలేకపోయింది."

అతని నిర్లిప్తత, నిరాసక్తత, స్తబ్దత, అనారోగ్యం, ఒంటరితనం అందుకు కారణం.

'మోనా' ఆర్వీ నాగరాజును చూపించాడు. అతనూ, ఇతనూ ఇద్దరూ వెళ్లిపోయారు. అయితే అతనిని నా మనసు 'కృతజ్ఞతా'పరిమళం నిత్యం ఆవహించే వుంటుంది!

Regn.No. : RN 1156 / 57 J/Nellore/008/09-11



# మంత్రిత్వాలు ఆశించేవారికి మనసంతా దిగులు!

రోశయ్య మంత్రివర్గ ప్రక్షాళన చేస్తాడు, తమను పదవీ అందలాలు ఎక్కిస్తాడనే ఆశతో ఉవ్విళ్లూరుతుండిన వారంతా ఒక్కసారిగా దిగాలు పడి పోయారు. జగన్, రోశయ్యల భేటీ తర్వాత రాజకీయం పెను మార్పులకు గురౌతుందనే భావన ప్రచారం కావడమే ఇందుకు కారణం. ముందు అనుకొన్న ప్రకారమైతే, జగన్ మనిషి అనుకొన్న వారినందరినీ వూడబెరికి పారేస్తాడని భావించారు. ఆ ఖాళీలను తమతో భర్తీ చేస్తారని భ్రమపడ్డారు. కానీ ఇప్పుడు పరిస్థితి మారిపోయింది. జగన్ తనంతట తానుగా ఇంటికి వచ్చి వెళ్లిన తర్వాత ఆయన మనుషులను దెబ్బ తీస్తే, తనకు చెడ్డ పేరు వస్తుందని భయపడుతున్నాడు రోశయ్య. జగన్ రాజీకి వచ్చినా కోరి తగవు పెంచాడన్న నింద పడుతుందని భావిస్తున్నాడు. అందువల్ల కనీసం కొంత కాలమైనా తన వైపు నుంచి జగన్‌కు నష్టం కల్గించే పనులు చేయకూడదన్న నిర్ణయానికి రాక తప్పడం లేదు. దాని ప్రభావం మంత్రివర్గ విస్తరణ మీద పడుతున్నది. కెవిపి రామచంద్రరావు కూడా అదే సలహా ఇస్తున్నాడట. పెద్దగా మార్పులు వద్దు, మీకు కావలసినవారు నలుగురైదుగురిని తీసుకొని సరిపెట్టండని చెప్తున్నాడట. ప్రస్తుతానికి ఆ సలహా బాగా నచ్చుతున్నది రోశయ్యకు.

దీని ఫలితంగా కొత్త మంత్రి వర్గంలో పదవులు ఆశించిన మర్రి శశిధర్‌రెడ్డి, డిఎల్.రవీంద్రరెడ్డి, జానారెడ్డి, జె.సి.దివాకర్‌రెడ్డి, ఏరాసు ప్రతాప్‌రెడ్డి, ఆదాల ప్రభాకర్‌రెడ్డి, స్పీకర్ కిరణ్‌కుమార్‌రెడ్డి వంటి వారంతా హతాశులైపోయారు. వారి మనసంతా దిగులు గూడుకట్టుకొంటున్నది.

## మర్రికి ఉప ముఖ్యమంత్రిత్వం

వీరిలో ఒక్క మర్రి శశిధర్‌రెడ్డికి మాత్రం రోశయ్య పదవి ఇస్తాడని పరిశీలకుల అంచనా. మాజీ ముఖ్యమంత్రి స్వర్గీయ మర్రి చెన్నారెడ్డి పట్ల తనకున్న గౌరవభావాన్ని చాటుకోవడానికి ఆయన ఉత్సాహపడుతున్నాడని వినికిడి. ఒట్టి మంత్రిత్వమేకాదు, శశిధర్‌రెడ్డికి మొత్తం మంత్రివర్గంలో

కొరవ 14వ పేజీలో



నెల్లూరు వేదాయపాళెంలో లిల్లి లిటిల్ ఫ్లవర్ స్కూల్ నిర్వాహకుడు నారాయణరెడ్డి కుమారుడు కృష్ణచైతన్య, వెంకటగిరి కాంగ్రెస్‌పార్టీ ఇన్‌ఛార్జి మేడా సునీల్‌కుమార్‌రెడ్డి కుమార్తె నిశ్చల వివాహ నిశ్చితార్థం సందర్భంగా నేదురుమల్లి జనార్దనరెడ్డి, కలెక్టర్ రాంగోపాల్, ఎస్పీ దామోదర్.

● వైఎస్ విగ్రహం సాక్షిగా

# రగులుతున్న కావలి రాజకీయం

కావలి టౌన్‌లో ప్రతిష్టించడానికి తొమ్మిదడుగుల వైఎస్ కాంస్య విగ్రహం తయారు చేయించారు మాజీ ఎమ్మెల్యే మాగుంట పార్వతమ్మ. కావలి అంటే, మొదటి నుంచి ఆమెకు అభిమానం ఎక్కువ. సుబ్బరామరెడ్డి ఎమ్పీగా గెలిచినప్పటి నుంచి కావలివాసులతో సంబంధాలు నెరపుతున్నారామె. ఆ తర్వాత అక్కడ నుంచి ఎమ్మెల్యేగా గెలిచారు. మొన్నటి ఎన్నికలలో ఆమెను తప్పించి కాటంరెడ్డి విష్ణువర్ధన్‌రెడ్డికి టిక్కెట్ ఇచ్చాడు వైఎస్. రాజశేఖర్‌రెడ్డి. దానికి కారణాలు చాలానే వున్నాయి. అప్పటి నుంచి కావలి కాంగ్రెస్‌వాసుల పరిస్థితి ఎవ

కొరవ 14వ పేజీలో


# ఆరవ వర్ధంతి

(12-04-2010)

కాలం కరుగుతున్నా 'మరపు' రాక 'గాయం రేగుతూనే వుంది! ఆనందాన్ని అందుకోలేని, సంతోషాన్ని పంచుకోలేని - చెప్పలేని 'వెలితి' గుండెలనిండా! దానికి 'అంతం' ఎప్పటికో!?! అశ్రునయనాలతో...

కలవకూరు సూర్యకళారెడ్డి, బి.ఏ., బి.యల్.,

కీ॥శే॥ శ్రీమతి కలవకూరు చంద్రకళారెడ్డి, బి.ఏ., బి.యల్., గారు

పరమపదించి ఆరు సంవత్సరములు అవుతున్న సందర్భముగా వారి పవిత్రాత్మకు శాంతి కలుగజేయాలని భగవంతుని ప్రార్థిస్తూ...

కీ॥శే॥ శ్రీమతి చంద్రకళారెడ్డి, B.A., B.L., (KVR)

మరణం : 12-04-2004

భర్త : కలవకూరు శ్రీనివాసులురెడ్డి (KVR)

తల్లి : వల్లపరెడ్డి వెంకటరమణమ్మ

చెల్లెలు : కలవకూరు సూర్యకళారెడ్డి, B.A., B.L.,

మరిది : కలవకూరు ప్రభాకర్‌రెడ్డి, (KVR)

కుమారుడు : కలవకూరు విష్ణుకిరణ్‌రెడ్డి, M.S., (USA)

కోడలు : కలవకూరు హారిణిరెడ్డి, M.C.A.,

కుమార్తెలు : యం. గోహితారెడ్డి, M.S., (USA)
పి. సౌమితారెడ్డి, B.Tech
కె. నిహితారెడ్డి, B.Tech

అల్లుళ్లు : యం. వాసుదేవరెడ్డి, M.S., (USA)
పి. శ్రీరామ్‌రెడ్డి, B.Tech
Tata Tele Services, Hyd.

మనుమడు : పి. శ్రీహర్షిత్‌రెడ్డి, Baby boy

మనుమరాలు : బేబి యం. అనౌష్కారెడ్డి

మరుదులు : కె.సుధాకర్‌రెడ్డి - సుదర్శనమ్మ
కె. విజయశేఖర్‌రెడ్డి - శైలజ

బావ : కె.వి.రమణారెడ్డి

KVR Brothers & sons మరియు కుటుంబ సభ్యులు, నెల్లూరు.


Edited, Printed and Published by N. Dolendra Prasad. Ph: 091-861-2327354, Offset Printing at Zaminryot Press, Nellore.